

అక్షదామ, శుక, వారిజ, పుస్తక రమ్యపాణికిన్ వాణికి
క్షోణీతలంబు నన్నుదురు సోకగ మ్రొక్కి నుతింతున్

Acc No: 2461

# సూక్తి వైజయంతి

## సందేశాత్మిక సూక్తులు

(ప్రథమభాగము - త్రివర్గకాండము)



వాచస్పతి :

డాక్టర్ వానమామలై వరదాచార్యులు

# సూక్తి వైజయంతి

By
Dr. Vanamamalai Varadacharyulu

Acc No: 2461
20S·8E1
VAR

ప్రచురణ :
1978 : శ్రీరామనవమి

ముఖపత్ర రచన :
మడిపడగ బలరామాచార్యులు
సరస్వతీ చిత్రము (గ్రంథాదిలో)
శీలా వీర్రాజుగారు.

ముద్రణ :
శ్రీరామా పవర్ ప్రెస్, సుభాష్‌రోడ్,
సికింద్రాబాద్.

వెల రూ. 10-00

ప్రతులకు :
వానమామలై వరదాచార్యులు
పోస్టు చెన్నూరు,
జిల్లా ఆదిలాబాద్.

కృతిస్వీకర్త



గౌ॥ ఆం. ప్ర. ముఖ్యమంత్రి
డాక్టర్ మర్రి చెన్నారెడ్డిగారు

శ్రీ వాగీశ్వర్యై నమః

# అంకిత ప్రదానము

సర్వప్రజా సమూహమది స్వాగతమిచ్చె నెడంద మెచ్చి యాం
ధ్రోర్వికి ముఖ్యమంత్రివగు యోగ్యుఁడ వీవెయటంచు నెంచెనా
నిర్విరతిన్ బ్రజాప్రభుత నిర్వహియించె నమాత్యరాణ్మణీ!
గర్వముజెందు నాంధ్ర, తెలగాణము నీప్రతిభా ప్రసిద్ధికిన్.

మఱ్ఱి చెన్నారెడిన్ శశిన్ మంత్రివర్య
మఱ్ఱి చెన్నారెడిన్ నీ సమాఖ్యలోన
చుక్కబలగము తా శశిన్ జుట్టినట్లె
అఖిల ప్రజల బలమ్ము మీ యండనుండె.

ఈ మఱ్ఱి నీడ తా నెందరిండ్లేలేని బీదల కిలునిలబెట్టగలదొ
ఈ మఱ్ఱియూడ తా నెందరి యనదలకై కరాలంబముగాగలదొకొ
ఈ మఱ్ఱివృక్ష మ్మదెన్నెని గతిలేని పక్షులకు నభీష్టఫలము లిడునొ
ఈ మఱ్ఱి బీజమ్ము లేరాజదుర్గమ దుర్గవిభేదక సర్గమగునొ.

తలప నీమఱ్ఱి తనదు పత్రములలోన
నెన్ని యాకలి డొక్కల కన్నమిడునొ
తమిని నీమఱ్ఱియేజనతా జనార్ద
నులకు వటపత్ర శయ్యయై యలరునొక్కొ.

మంచి, పరితాప పడిన మీ మానసమ్ము
ఎంచి కన్నీటి చుక్కయై గాంచుఁ బదను

చెడు విజృంభించ మీ యెద కడు తెగించి
కటుకు వజ్రపు ముక్కయై గాంచుఁ బదను.

పరదాస్య శృంఖలాబద్ధయౌ భారత
మాతృదాస్య విముక్తి మనవిధి యని
గాంధీమహాత్ముని ఘనపాంచజన్య వి
ప్లవశంఖ రావమ్ము చెవిని బడనె
శాంత్యహింసా సత్య శస్త్రాస్త్రధారులై
సత్యాగ్రహామోఘ సమర భువిని
స్వాతంత్ర్య రక్షకై శపథమూను తెలుంగు
పురుష సింహముల నొక్కరుడ వీవు
మిమ్ముబోల్ త్యాగుల కృషిఫలమ్మెకాదె
తెల్లవారి పాలన నిశి తెల్లవారె
దక్కనను తెలంగాణము దక్కె మనకు
జనవిహితసద్విచార ! శీతనగధీర !

నేటి యాంధ్రదేశ ప్రజానీకమునకు
తమరి నేతృత్వమొక యదృష్ట మనవలెను
ముఖ్యమంత్రిగా మీరాక సఖ్యభావ
వరశరచ్చంద్ర రాకయై వరలె మాకు.

అలరు మీ సుమనస్సు నందు దానెందును
వరకళాదరణ సువర్ణ గరిమ
అడరు మీ సుమనస్సునందు దామెందును
వర ప్రజా సేవాసువాసనలును

చెలగు మీదు సుమనస్సీమనెందును జనా
వన రాజ్య చారుతా వైభవంబు
అమరు మీసుమనస్సునందు దా నెందును
దైవ భక్త్యైక సుధామధురిమ
వన్నెతరుగదు చెడవు సువాసనలును
అందమరుగదు మధువూరు నక్షయమని
కాశి విశ్వనాధుఁడు పూజకై ధరించి
తమిఁద్రిలింగ ప్రజకుఁ బ్రసాదమని యిచ్చె.

చిచ్చిడు భానునిన్ వడకఁ జేసెడి సోముని లెక్కసేయకన్
పచ్చని పైరులంబితికి బంగరు పంటల నన్న వస్త్రముల్
మచ్చికనిచ్చి పెంచు నభిమాన ధనాన్వితవంశజాతుఁడౌ
అచ్చపు రైతుబిడ్డడని యాదృతి నాకృతి నివ్వరించెనో.

తఱిఁగని జన్మధాత్రికిని దాస్యవిముక్తి ఘటింప ధర్మ సం
గరమున శాంత్యహింసలను ఖడ్గములూని రిపున్ జయించు సుం
దరుఁడగు త్యాగమూర్తి యని తానయికోరెను నాదు కావ్యసుం
దరి నిను మంత్రిమండలిసుధాకర చెన్నపరెడ్డి ధీమణీ!

మచ్చికమీర మీరొకట మాదగు చెన్నపురమ్ము గాంచగా
వచ్చిన నాడు నాదుకృతి వారిజలోచన మీకు స్వాగతం
బిచ్చి స్వకీయ గానసుధ లీయగ నెంతయు సంతసమ్మునన్
మెచ్చిన మీరసజ్జిత కమేయగుణాఢ్యతకున్ వరించెనో.

అన్నివిధముల నీవ సమర్థుఁడవని
మత్కృతియొ నిన్నువలచె నమాత్యముఖ్య !
కృతి సువర్ణసుందరి యలంకృత గుణాఢ్య
దీని గొనుమి యైశ్వర్యజగాన మనుమి.

ఇట్లు నీవాడు

వానమామలై వరదాచార్యులు

శ్రీ వాగీశ్వర్యై నమః

# విజ్ఞప్తి

నా సాహిత్యకృషి సుమారు ఏబది సంవత్సరాల కాలమునుండి సాగుచున్నది. ఈ అర్థశతాబ్దిలో చిన్నవి పెద్దవి కలిసి మొత్తం ఏబది రచనలు నాచే సృజింపబడినవి. ఇవి వివిధ సాహిత్య ప్రక్రియలలో నిర్మింప బడినవి. మహాకావ్యము పోతన చరిత్ర మొక్కటి తాను 15 సంవత్సరముల కాలము తీసికొనినది. మహాకావ్యము, ఖండకావ్యములు, నాటకములు, నాటికలు శతకములు, సూక్తులు, గేయనాటికలు - నవలలు - వచన కవితలు సాహిత్య వ్యాసములు. వ్యాఖ్యానము - బుఱ్ఱకథలు - యక్ష గానము మొదలగునవి రచించినాను. ఇందులో 15 పుస్తకముల ముద్రించి ప్రకటింప గల్గినాను. నా జీవితమిట్లు సాహిత్య నిర్మాణమునకే యంకిత మగుట మత్పురాకృత పుణ్యవిశేష మనవలెను. ఇంకెన్నియో రచనలు అముద్రితములు గానుండుట నా దురదృష్టమనుకొనవలెను.

ఇప్పుడీ సూక్తులనే గ్రంథమును ముద్రించుటకు సాహసించితిని. ముద్రించిన పుస్తకములు విక్రయింపబడినచో కవికి తదితర కృతులు కొన్ని ముద్రణ మొందుటకు వీలుగల్గును. కాని నవలలు దప్ప తక్కిన సాహిత్య ప్రక్రియలలోని రచనలు అమ్ముడు పోవుట మిక్కిలి కష్టమైనపని. గ్రంథా లయములైనను ఇట్టి గ్రంథముల కొనుటకు నుద్యుక్తములుకావు. ఇక పద్యరచయితలు పనికిరానివారు కావలసివచ్చుచున్నది.

పద్యసాహిత్యము చదువువారు పండితులు మాత్రమే. తెనుగు భాష అధికారభాషగా మరియు బోధనా భాషగా మారినను తెనుగు భాషయందు నూటికి 99 మంది పాండిత్య పరిచయములేనివారే కావలసి వచ్చుచున్నది. పూర్వకవికృత పురాణేతిహాసకావ్యగ్రంథములు వాని లోని కవితా సంపద వానిలోని జ్ఞాన సంస్కారవిశేషములు వల్లనిభోజ నములై కూర్చొనినవి. ఆంగ్లభాషా పండితుల సంఖ్య బహుళముగా

యను నంతటి తెలుగుదనమును అపాదించుకొని రామ కథామధురిమను గీత రూప కవితలలో గానము చేసినది.

ఇతని యమూల్య రచనలలో "వైశాలినీ" దృశ్యకావ్యము ఆంధ్ర నాటక కృతులలో అపూర్వ ప్రతిభా సమన్వితమై అత్యుత్తమ కథా సన్నివేశములతో రసభూయిష్ఠమై లక్ష్యలక్షణ సమన్వితమై ఆంధ్రసాహితీ యోషామతల్లికి దివ్యాలంకార మణిమకుటమై శోభిల్లినది. ఇంకను ఇతని రచనలు ప్రక్రియా వైవిధ్యముతో సహృదయ రంజకములై పరమార్థ ప్రతిపాదకములై యనేకములుగా భాసిల్లినవి. అందు అముద్రితములేపెక్కు.

ప్రస్తుత కృతిరాజము "సూక్తి వైజయంతి". ఇది యావదాంధ్ర సోదర సోదరీమణులకు సరస్వతీ వరప్రసాదము. ఇందలి సుభాషితములు పఠితల హృదయములను ఎట్టి కథా సన్నివేశము లేకుండా ఇట్టె తమ వైపునకు లాగికొనుటయేగాక నీతివర్తనము గురించిన ప్రాముఖ్యమును హృదయంగమముగా సోపమానముగా ప్రమాణీకరించుచున్నవి. ఒక్కొక్క పద్యరాజము వాడిపోవని యొక్కొక్క సుమరాజము. ఈ సుమరాజ సువాసనలు ఇతర దుర్విషయ వాసనలను పారద్రోలి మానవ హృదయ క్షేత్రములను సుగుణామోద సువాసితములుగా నొనర్చుననుటలో నత్యుక్తిలేదు. అందులకే దీనికి 'సూక్తి వైజయంతి' యను నామకరణ మొనర్చబడినదేమొ. అలతి పదములలో అనంత పరమార్థ భాండాగార మును పొదిగించి ఇంపుగా సొంపుగా చదువరులకు అందించిన యీ యమూల్య వైజయంతీ సుమసౌరభాలు విశ్వవ్యాప్తముగా వీచి యచిర కాలములోనే విశ్వమును సువాసనా వాసితము జేయుననుటలో సంది యము లేదు.

ఈ కృతిలో తరచు ఆటవెలదులు, తేటగీతములు వాడబడినవి. అచ్చటచ్చట మచ్చుతునకలుగా కందములు ఉపయోగింపబడినవి. ఆట వెలదులు ముద్దుముచ్చటగా తమ చిన్నారి పదాలతో చిన్ని చిన్ని

చిందులు త్రొక్కుచు ప్రతి యొక చిందులో వీనుల విందుగా ప్రబోధా మృతరసమును చిందుచున్నవి. ప్రతిపద్యము విబుధ జనశిరోధార్యమై చిరస్మరణీయమై జీవిత యాత్రాపథములో పదే పదే హితోపదేశాత్మకమై విరాజిల్లినది. బాలురకును స్త్రీలకును సామాన్య సాహితీ జ్ఞానముగల ప్రతి వ్యక్తికిని ఈ గ్రంథరాజము సుగమాన్వయమగు సులభశైలిలో రూపొందించబడినది. మన యాంధ్రదేశ ప్రజలకు సూక్తులు ప్రసాదించిన కవులెందరో కలరు; అందు ముఖ్యులు వేమనయోగి, సుమతి పద్యకారుడు. దాశరథీ శతకకర్త, కాళహస్తీశ్వర శతకకర్త యగు ధూర్జటి మున్నగు మనీషి వతంసులు కొందరే.

సూక్తి ప్రదాతలగు రచయితల రచనలలో సూక్తి వైజయంతి తన 'సూక్తి వైజయంతి' యను నామమును సార్ధక మొనర్చుకొని ధ్రువ తారగా వెలుగొందుననుటలో అతిశయోక్తి లేదు. ఇదివరకటి ఆంధ్ర సూక్తి రచనలలో వర్గ విభజీకరణ పద్ధతి యనుసరింపబడలేదు. ఈ వర్గీకరణ పద్ధతి శ్రీ వానమామలై విరచిత సూక్తి వైజయంతిలోనే నూతనముగా ప్రవేశపెట్టబడినది. ఈ సౌకర్యము చదువరులకు వారి వారి ఇష్టానుకూలముగా ప్రత్యేక విషయములను పఠించుకొనుట కనువగు సదవకాశము కలిగించుచున్నది. ఈ పద్ధతి గీర్వాణభాషా కవివరేణ్యులగు భర్తృహరి సుభాషితములందు మాత్రమే కనిపించుచున్నది. అదియును ఇంతటి విస్తృత పథకంలో చేపట్టబడినది కాదు.

ఈ కృతిలోని సూక్తి రత్నములు, తొలుతగా రెండు విభాగములుగా విభజింపబడినవి. 1. ధర్మజిజ్ఞాస, 2. బ్రహ్మజిజ్ఞాస. ధర్మజిజ్ఞాసలో ముఖ్యాతి ముఖ్యములుగా పురుషుడు సాధించవలసిన పురుషార్థ త్రితయము క్రమపద్ధతిలో పేర్కొనబడినది. ధర్మ, అర్థ, కామములను త్రివర్గముగా, మోక్షమును అపవర్గముగా విభజించి ఈ చతుర్థ పురుషార్థమును బ్రహ్మజిజ్ఞాస విభాగములో చేర్చనైనది. బ్రహ్మజిజ్ఞాసలో ఈశ్వరుడు

మరియు భక్తి, జ్ఞానము, వైరాగ్యము, ప్రపత్తి అను నాల్గింటిపై తాత్త్విక నిర్వచనము చేయబడినది.

ఇతరములగు వివిధ నిర్వచనీయాంశములు సంకీర్ణ వర్గములో చేర్చ బడినవి. ఈ సంకీర్ణములో నేటికాలపు దుర్నీతిని అక్రమ ప్రవర్తనమును స్వార్థపరతను మోసపు పోకడలను ఎత్తి చూపించుచు యివి యన్నియు మానవ సమాజ ప్రగతికి గొడ్డలి పెట్టువంటివని నిరూపించుచు ఈ కలుషిత వాతావరణమును తుడిచి వేయుటకే ఆధ్యాత్మిక నీతి ప్రగతి పథంలో సాగిన వీరి సూక్తులు దర్శనముల వంటివని నిస్సంశయముగా చెప్పవచ్చును. మరొక విశేష మేమనగా వీరు తమ యమూల్య సూక్తి రత్నములను 'మకుట' రహితముగా ఒక కంఠహారముగా రూపొందించినారు. నిర్మకుట కవి చక్రవర్తియగు వీరికి ఈ 'నిర్మకుట' సూక్తి రత్నగ్రథనము ఎంతయు సమంజసము. ఇవి భర్తృహరి సుభాషితములవలె కావ్యభాషా ఫక్కిలో ప్రౌఢశైలిలోపోక జనసామాన్యమునకు అందుబాటులోనుండు సామాన్య భాషలో రచింపబడుట ఎంతయు ప్రశంసనీయము, ప్రయోజనవంతమును. ఏవో పదియైదు మాత్రమే పండితైక వేద్యములుగా గూఢార్థ ప్రతి పాదకములుగా కన్పట్టుచున్నవే తప్ప తక్కినవి మృదు మధురపద నిగదితములు.

ఈ సూక్తి రచనలలోని ముఖ్యాతి ముఖ్య విశేషమేమన ప్రతి పద్యము సోపమానమై సోదాహరణమై పఠితల హృదయ ఫలకములపై చెరగని ప్రభావ ముద్రనువైచి తక్షణ హృదయపరివర్తన గావించు చున్నది. జీవిత పథంలో ప్రగతిని సాధించుటకై ఈ కృతిలోని ప్రతి పద్యము మహత్తర మంత్రశక్తిగా పనిచేయుననుట నిర్వివాదాంశము. వీరు ప్రయోగించిన యుపమానములు నిరుపమానములు సరిక్రొత్తలు. బహుశా వక్తవ్యాంశమును ప్రమాణీకృతముచేసి హృదయంగమ మొనర్చు టలో ఉపమానాలంకారమునకున్న మంత్రశక్తి మరిదేనికి లేదేమో

యన్నంతటి మహోచ్ఛ స్థాయిలో వీరి యుపమాలంకృతి కొనసాగినది. ప్రకృతి గర్భములో అచ్చటిదచ్చటే దాగియుండి ప్రతిభావంతులగు మహాకవుల క్రాంత దర్శిత్వదృష్టికేతప్ప తదితర కవుల సామాన్య దృష్టికి రాని యుపమాసామగ్రి వీరికి కొట్టిన పిండి. అన్ని ప్రక్రియలలో సిద్ధ హస్తులగు వీరు ఉపమాలంకార భూషిత సుభాషిత రచనలలోనేకాదు నాటక రచనలలో సహితము అపరకాళిదాసే యనవచ్చును. ఉపమా కాళిదాసస్య అను శ్లోకచరణమునకు ప్రక్క (వరదార్య కవేస్తథా) అని చేర్చిన బాగుండునేమో యనిపించినది.

ఆచార్యులవారి దివ్య మూర్తిత్వము ఈ సూక్తి వైజయంతిలో సంపూర్ణముగా మూర్తీభవించినదని యనుటకంటె వీరే ఈ కృతిరూప ములో సాక్షాత్కరించినారనుట ఎంతో సమంజసముగా నుండును. వీరు జగమెఱిగిన బ్రాహ్మణులు. యావదాంధ్ర - భూమిలో సుప్రసిద్ధ మహా కవులు. వీరి ప్రతిభా పాండిత్యములు ఆంధ్ర సోదరులకు సువిదితములు సుపరిచితములు. నిరాడంబర జీవులు, నిష్కళంకవర్తనులు, వినయ భూషణులు సౌమ్యమూర్తులు వీరు. ఆధ్యాత్మిక విజ్ఞాన సంపదయు అనన్య సామాన్య కవితా సంపదయు వీరి ఆస్తి సర్వస్వము. ఏకలవ్య శిష్యులుగా నెందరో వర్ధమానకవులు వీరినుపాసించుచునే యుందురు. వీరి యుత్త మోత్తమ రచనలన్నింటిలోను ఈ సూక్తి వైజయంతి "విశ్వశ్రేయః కావ్యమ్" అనెడి ప్రామాణిక వచనమును సార్థకము చేసెడి పరమ ప్రయోజనకారి కృతిగా పాఠకాంధ్ర మహాశయుల హృదయ పద్మాసనము లలో సుస్థిరమైన చోటు జేసికొని ఆ చంద్రతారార్కము భాసించునని యాశించవచ్చును.

ప్రస్తుత మీకృతిలోని కొన్ని పద్యములు మాత్రమే మచ్చు తున కలుగా గైకొని వాని యందచందములు వానిలోని మెఱుగులు నాశక్తి కొలది చూపించుట మత్కర్తవ్యముగా భావింతును. వీరి ఈ రచనలలో

నున్నది. ఆంగ్లమునకున్న ఆదర గౌరవములు ఆంధ్రదేశములో ఆంధ్ర భాషకే లేకుండుట విచారణీయము. ఆంగ్లము ప్రపంచ భాష యగుటచే నది యవశ్య పఠనీయమే యైనను, మాతృభాషయగు యాంధ్రమును మన వారు చిన్నచూపు చూచుట శోచనీయము గాదా ! ఎంతయో సాహిత్య సంపద మన కావ్యపురాణాలలో నున్నది. అది యెవరుపయోగించుకోనని నిరర్థక ద్రవ్యముగా మారుచున్నది. బి. యే.. పట్టభద్రులైనవారికి గూడా చాల జనమునకు తెలుగు సరిగా తెలియకుండుట దురదృష్టకరము.

ప్రభుత్వము ప్రజలు ఆదరించిననే ఏ భాషయైనను సుసంపన్నమై రాణించగలదు. శాస్త్రములు కళలు భాషా యోషకున్న రెండు కన్నులు. అందు శాస్త్రము మేధస్సు పెంచి విజ్ఞానము నుపదేశించి ప్రయోజన కరమై కానవచ్చుచున్నది. కళలు విజ్ఞాన వినోదముల రెంటిని గలిగించి, సంస్కారమును పెంచి మనస్సును విశాల మొనర్చి మానవత్వమునకు ఉద్దీప్తిని గలిగించుచున్నవి. మనస్సులేని మేధస్సు మహా ప్రమాదకర మైనది. అందుకే శాస్త్రములు కళలు రెండును కావలసినవే. వివిధ సాహిత్య ప్రక్రియలు "విశ్వశ్రేయః కావ్య" మను లక్ష్యమునకు గురి యైన వైనను సూక్తి ప్రక్రియ మొదటినుండి ప్రజలలోనికి సులభముగా చొచ్చుకొనిపోయి సత్ప్రవర్తనము సద్గుణసంపత్తిని ప్రబోధించుచు మిక్కిలి ప్రయోజనకరమైనదిగా నున్నది. ఈ సూక్తి సాహిత్యములో సులభపదగ్రథనముండుటయు దీనికికారణముగాకపోదు. ఇపుడట్టి సాహిత్యప్రక్రియ యగు సూక్తిసంప్రదాయము నారాధించి యీ గ్రంథమును వ్రాసితిని.

దీనికి "సూక్తి వైజయంతి" నామకరణ మొనర్చి సుమా రేడు వందల పద్యములు వ్రాసితిని. అన్నియు ఆటవెలదులు తేటగీతులు కంద ములే ఐయున్నవి. సూక్తులకీపద్యములే హృద్యములై యుండుట మన కనుభవైక వేద్యమగు విషయమే.

ఈ ప్రక్రియలో వ్రాసిన వారిలో తెనుగునందు వేమన సుమతి నార్లవారు మొదలగు వారు ప్రసిద్ధులు. మన సాహిత్య సారస్వతములకు ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములు ప్రయోజనము లైనవి.

అందువల్లనే నేను మన సంప్రదాయానుసారముగా ఈ గ్రంథ సూక్తులను ధర్మార్థకామమోక్షములను నాల్గు పద్ధతులలో విభజించితిని. మొదటి మూడు త్రివర్గములని మోక్షము అపవర్గమని యుంటచే తిరిగి యా విభాగమును రెండు భాగముల కన్వయింపజేసితిని. త్రివర్గకాండ మనియు అపవర్గకాండమనియు ఆ రెండు భాగములకు నామకరణ మొనర్చితిని. సంస్కృతములో భర్తృహరి ఇంచుమించుగా నిట్టి విభాగమునే యొనర్చినట్లు స్ఫురించును. తెనుగు సూక్తులలో నీ విభాగములేదు. నీతి శతకము ధర్మార్థములకు, శృంగారశతకము కామమునకు, వైరాగ్య శతకము మోక్షమునకును విషయములై యుండుటచే భర్తృహరి సుభాషితములలో నిది పొసగుచున్నది.

నేను దీనిలో సుమారు మత్కృత పూర్వకావ్యములనుండియు వంద పద్యముల వరకు గ్రహించితిని. యేయే విభాగమునకేవి సరిపడునో వానినందు జేర్చితిని. దీనిని సహృదయులామోదించిన నేను ధన్యుడను,

ఈ గ్రంథము ఆంధ్రప్రదేశ్ ముఖ్యామాత్యులు గౌ॥ డాక్టర్ చెన్నారెడ్డిగారు కృతిగా స్వీకరించుటకు ఆమోదించుట వారికెంతయు కృతజ్ఞుడను, ముఖచిత్రములు వేసిన బలరామాచార్యులకు, శీలా వీర్రాజు గారికి, ముద్రణ త్వరగా నొనర్చి నాయందు దయజూపిన పబ్బా శంకరయ్య గారికి కృతజ్ఞుడను. పీఠికను వ్రాసినా కావ్యమునకు తలపై మకుటమిడిన మదగ్రజులు శ్రీ జగన్నాథాచార్యుల వారికి డాక్టర్ సి. నారాయణరెడ్డి గారికిని నేను సర్వదా కృతజ్ఞుడను విధేయుడనై యుందును.

ఇట్లు

వానమామలై వరదాచార్యులు

శ్రీ వాగీశ్వర్యై నమః

# పీఠిక

సుమారేడువందల పద్యములుగల ఈ సూక్తి వైజయంతి యను కృతి డా॥ వాచస్పతి వానమామలై వరదాచార్యులుగారి రచనలలోని వివిధ ప్రక్రియలలో నొక యమూల్య ప్రక్రియా రత్నముగా, ఆంధ్ర భాషలోని నీతి ప్రబోధక కృతులలో తలమానికముగా వెలుగు కావ్య రాజము.

ఈ నిర్మకుట కవిచక్రవర్తిగారి రచనలన్నియు దేనికదే తన ప్రత్యేక విశిష్టతను కలిగినవై విశ్వసాహితీ రంగంలో అనన్య సామాన్య ప్రతిభావంతములుగా అప్రతిమానములగు ఉత్తమోత్తమ రచనలుగా వెలుగుచున్న వనుటలో అత్యుక్తి ఎంత మాత్రమునులేదు.

మానవ సమాజమును ధర్మబద్ధముగా నీతి నిజాయితీ కల దానినిగా తయారుచేయడంలో మహాకవి రచనలు తోడ్పడినంతగా మరేవియు తోడ్పడజాలవని యనుట సత్యదూరముకాదు. మహాకవులు మహర్షి తుల్యులు. జగత్కల్యాణ చింతనమే వారి ప్రధాన ధ్యేయము, సమాజ ప్రగతియే వారి ఏకైక లక్ష్యము. వారి లేఖిని తన గమ్యమును చేరుకొను నందాక విశ్రమించదు. నిరంతరము సాగిపోవుచు విశ్వమును వసుధైక కుటుంబముగా దిద్దితీర్చుటలోను, సమాజములోని కుళ్ళును కడిగివేయుట లోను దానికదేసాటి. "నా నృషిః కురుతే కావ్యం" అను నార్య వచనాను సారము విశ్వశ్రేయస్కరములగు వివిధ రచనల వెలయించుటయే వారి మహత్తర జీవితాశయము. "మార్గదర్శీ మహర్షిః" అను నార్ష వచనాను సారము మహాకవులు విశ్వమానవ సమాజమునకు సత్యమార్గ ప్రదర్శకులై యవతరింతురు గదా.

పై కోవకు చెందిన మహాకవిగా మహర్షిగా అఖండ విజ్ఞానధనిగా శ్రీ వానమామలై తన యమూల్య కృతులను సర్వాంగ సుందరములుగా పరమ ప్రయోజనవంతములుగా ఆంధ్రభారతీయోషామతల్లికి అనన్య దుర్లభములగు అమూల్య రత్నోపహారములుగా సమర్పించెను.

తనువులు మాత్రము వేరుగా ఆత్మ యొక్కటిగా బెరిగిన మా సహోదరుల యన్యోన్య సౌభ్రాత్రానుబంధము నిర్నిబంధ నిర్నిద్ర సౌహార్దరసానుబంధముగా నిత్యానుసంధానమధురప్రబంధముగా సాగి పోయిన యా చిన్ననాటి రోజులలోనే శ్రీ వానమామలై దివ్యా త్మలో కవితా సరస్వతి తొలిసారిగా తొంగి చూచినది. అప్పుడు వీరి కవితా సరస్వతి 'డాగురుమూతలు' లోనే యుండిపోయినది. వయసు వచ్చిన కొలది రూపురేఖలు సంతరించుకొని సువర్ణ సుందరియై 'మణిమాలా' భూషాలంకృతయై యలరారుచు లలితపద విలాస విన్యాసగతి నలవరించు కొన్నదై యఖిలాంధ్ర లోకమును తన వైపున కాకర్షించు కొన్నది.

తన కాటుక కంటినీరు తుడిచి తనను కర్ణాట కిరాత కీచకులకమ్మ కెప్పక సమాదరించిన భక్తపోతన కవివరేణ్యుని ఋణము దీర్చుకొనుటకై, శ్రీ వానమామలై వేషమున నవతరించిన యభినవ పోతనగారి లేఖినిలో నావేశించి అతని స్వీయ చరిత్రమునే అఖిలాంధ్ర కావ్య మకుటాయ మానముగా విలిఖింపజేసి, యావదాంధ్ర భూమిలో అతనికి అద్వితీయమైన మహాకవి శ్రేయస్సు నందజేసినది.

ఆ తర్వాత ఏతత్ కవి ప్రలబ్ధి 'విప్రలబ్ధి' గేయకావ్యము తన గేయ కవితా ప్రక్రియలో అద్వితీయమై అత్యంత మృదు పద బంధురమై మధు రాతి మధురమై తంత్రీలయ సమన్వితమై గేయసాహితీ భారతికే అమూల్య రత్న విపంచియై యలరారెను. ఏతత్ కవి విరచిత "గీతరామాయణ" అనువాద కృతియు అనువాదకృతి యనిపించుకొనక ఆంధ్రమూలమే

ప్రథమ విభాగమైన ధర్మజిజ్ఞాసలోని రెండవ పద్యములో సకల ధర్మసార సర్వస్వమును మున్నూరు వడపోసి తీసిన రసాయనమాయను నంతటి యుచ్చస్థాయిలో పాఠక మహాశయులకు అందించబడెను. (ఆత్మ కనను కూలమైనట్టి దుశ్చర్య లొరులపట్ల సేయకుండు టొకటి) యనునదే యీ పద్యము. (ధర్మహీనుడెందు దాభక్తవరుడయ్యు, వాని భక్తి ఎల్ల వ్యర్థ మరయ ఆజ్ఞ మీరు భార్య యత్యంత ప్రేమమ్ము నొలుకబోయ బతిని గెలుచుకొనునె) అను నీ పద్యములో భగవద్భక్తుడు భగవదాజ్ఞా రూప ములో నున్న తన ధర్మమునకు బద్ధుడై యుండుట తప్పనిసరి. అట్టి ధర్మ మునే పాటించని వారి భక్తి నిరర్థకమనియు దానిని భగవంతుడు స్వీక రించడనియు నిరూపించుటకు కవి మహాశయుడు ఒక చిన్న యుపమాన మును ఈ క్రింది విధముగా చూపెట్టినారు. ఏ భార్యయును తన పత్యాజ్ఞను ఒక వంక తిరస్కరించుచు, మరొకవంక అతని పాదసేవ చేసి నంత మాత్రాన పతి హృదయమును వశపరచుకొనగలదా యన్నాడు. ధర్మోద్ధరణమునకై పని గట్టుకొని అల్లంత దూరమునుండి ఇందవతరించిన పరమేశ్వరుడు ధర్మదూరుడైన భక్తుని పూజలు స్వీకరించునా? ఈ పద్య ములో ధర్మహీన భక్తవరునికంటె ధర్మబద్ధుడైన సామాన్య మానవుడే స్వామి హృదయంలో స్థానమును సంపాదించుకొనగలడను నిత్యసత్యము ప్రతిపాదించబడినది.

ధర్మమునకు సంబంధించిన మరొక పద్యంలో "ధర్మజీవనమ్ము దాభంగమందిన జనము నష్టపడును శాంతిచెడును. చెఱువు కట్టతెగిన వరసస్య జాలమ్ము వేరుతాడు భూమి సారమేగు". మానవ జీవనమ్మొక నిండు తటాకమనియు ధర్మము దానికొక సేతువనియు ఆ సేతువే తెగిన ఇంకేమున్నది. పైరు పచ్చలుసమూలముగా కొట్టుక పోవుటయేకాక భూమిసారముకూడా తుడిచి పెట్టుక పోవునుగదా! పైరు పచ్చలవంటి మన యాశలు నిరాశలై మన జీవితములో అశాంతి చోటు జేసికొనును.

కావున మానవశాంతి సుఖాలకు మూలాధారమైన ధర్మసేతువును కాపాడు కొనుటయే ధీమంతుని ప్రథమ కర్తవ్యము.

"మహినధర్మార్త సౌఖ్య సంపదలకన్న ధర్మఘటిత దుఃఖ దరిద్ర తలె యశమిడు" అను నీ పద్యములో అధర్మార్జితములగు సిరిసంపదలు భోగభాగ్యములకంటె ధర్మవర్తనముతో నొదవు దుఃఖ దారిద్ర్యములు కీర్తి ప్రదములు. కీర్తి మానవునికి జీవితముకంటె గొప్ప విలువ గలది. అపకీర్తి మరణముకంటె దుఃఖదాయకము. ఇందు అర్థముకంటెను కామ సౌఖ్యములకంటెను వేయేల జీవితముకంటెను కీర్తిప్రదమగు ధర్మమే రక్షితవ్యమని ఉదాహరింపబడినది.

"తల్లి దండ్రులేని ధర్మాతిరిక్తమౌ నడక జెప్ప దాని నిడువ నొప్పు" అనెడి ఈ పద్యములో ధర్మవ్యతిరేకమైన తల్లిదండ్రుల యాజ్ఞ యైనను అవశ్యము వర్జించదగినదే. తల్లి దండ్రులకేనియు ధర్మమే అనుసరణీయమగుటచే వారు తమ పుత్రులను ధర్మవ్యతిరేక కార్య కలాపాలకు ప్రేరేపించ వీలులేదనియు ఒకవేళ ప్రేరేపించిరేని వారి యాజ్ఞను సవినయముగా తిరస్కరించడమే కర్తవ్యమనియు ఇందుకు నిదర్శనముగా తండ్రిమాటను గైకొనని ప్రహ్లాదుని తల్లిమాటకు విలువ నీయని భరతుని దీనికొన్నారు. యద్యపి పితాజ్ఞా పరిపాలన ధర్మాంతర్గత మైనను విశేష ధర్మముక్రింద ఆ సామాన్య ధర్మము వీగిపోవలసినదేయని సిద్ధాంతీకరించబడినది.

"ధర్మహీనమైన తక్కిన పురుషార్థములన దలయెలేని మొండె మగును". అను నీపద్యములో ధర్మమును తలగా పోల్చి తక్కు పురుషార్థ ములను తలలేని మొండెములుగా చూపించినారు. తలకుగల ప్రాము ఖ్యము ఆలోచనా సామర్థ్యము తక్కిన యంగములకుండనట్లే ధర్మ మునకున్న ప్రాధాన్యము, తక్కిన పురుషార్థములకు లేదని రూఢి పరుచ బడినది ఏతావతా ధర్మమే ప్రధానముగా అనుసరణీయమని తేల్చబడినది.

ద్వితీయ పురుషార్ధముగా లెక్కింపబడు అర్ధమును గురించియు ఆచార్యులవారు చిన్నచూపేమియు చూడలేదనియే చెప్పవలెను. వీరి సునిశిత పాండిత్య దృష్టి అర్ధరూప పురుషార్థమునకు అన్యాయమేమియు చేయలేదనుటకు నిదర్శనముగా "అరయ నాలుగు పురుషార్థములందున ............ అడుగుముందు జరుగదవనిలోన" అనునీ పద్యములో అర్థము గణుతిలో ద్వితీయమయ్యును, ప్రణుతిలో అద్వితీయమైనది యని వాక్రుచ్చినారు. అర్థరహితుడు ప్రపంచములో ఒక్కడుగైనా ముందుకు వేయలేడని ఒక్కముక్కలోనే అర్థమహిమనంతయు కుదించి నుడివినారు. వీరి ఈ వర్ణనముగూడా అద్వితీయముగా నున్నదనవచ్చును. "అర్థవంతు పలుకు లర్థవంతమ్ములై వాసికెక్కు నెందు వాస్తవముయి" ఈ పద్యములో అర్థముగలవాని పలుకులు అవి కేవలము చిలుకపలుకులవంటివైనను ఎంతో పరమార్థముగలవిగా జనులు గొనియాడుదురు. అదే మరి అర్థహీనుడగు పేదవాని వాక్కులు వేదవాక్కులైనను "విధవా వయస్సు" వలె వ్యర్థములగునని వర్ణించబడినది. మిసమిసలాడు సరిక్రొత్త పరువముండియు పెనిమటిలేని జవరాలి యా పరువపు జిగిబిగువులు అడవిని గాచిన వెన్నెలలెట్లో యట్లే అర్థహీనుని వాక్కులు నాదరించు నాథుడు లేక వ్యర్థములగుననియు అర్థహీనునకు పలుకులుండియు పలుకుబడి లేదనియు అర్థవంతముగా నుడివినారు;

"ధనముగాంచి విద్య తలవంచికొనినిల్చు, ధనము నొద్ద బలము దాసుడగును. అందుకొరకె లక్ష్మినాశ్రయించి మురారి అజహరాదులకును నధికుడయ్యె" అను నీ పద్యరత్నమునకు ధనమున కెట్లో యట్లే తలవంచక తప్పదేమో యనిపించును. విశ్వకుటుంబియగు శ్రీమన్నారాయణుడు లక్ష్మినాశ్రయించి నప్పటినుండియే బ్రహ్మాదులకు సేవ్యుడైనాడట, ఎంత మహోదాత్తమైన దివ్యకల్పనాచమత్కృతియిది. "ధనము గల్గువాడె ధరణిని గలవాడు లేనివాడు పృథ్విలేనివాడు" దీనిని సమర్థించెడి యుపమానమును గమనించుడు "చెఱువులోన నీరు బరగునందాక నె బ్రదుకు

కాట చేప పరువులాట" ఈ యొక్క పద్యమే అర్థమును గూర్చి వర్ణించెడి కోటి పద్యములసాటి. ధనములేని వాడు ధరణిలో లేనివాడుగానే పరిగణించబడుట మనము కనులారగాంచుచున్నాము. జీవించి యుండియు లేనివాళ్లలో లెక్కింపబడుట ఎంత వంచనాస్పదము అసలే లేనివాడు లేని వాడు కాదు. ధనము లేనివాడే అసలు లేనివాడు. చెఱువులో నీరు చేపకు బ్రతుకుదెరువు, ఆ బ్రతుకుదెరువే లేకున్న చేప పరుగులాట కట్టు. మనిషికి సంసారంలో డబ్బులేకున్న మనిషి మనుగడ పరుగులాట సున్న. చేప నీరును విడిచి క్షణకాలము మనజాలదు. మానవ జీవితం అర్థమును విడిచి క్షణకాలము నెగ్గజాలదు.

ఇట్టి పరమ సత్యార్థ ప్రబోధకములైన అమూల్య పద్య రత్నములు ఈ కృతిలో కోకొల్లలు కుప్పలు తెప్పలు. వీనికి వ్యాఖ్యానమే వ్రాయ దలచుకొన్నచో అదియొక బృహద్గ్రంథ రాజముగా అలరునేమో. విష్ణు మూర్తి ఇరువురి భార్యలలో నెవరు యందములో గొప్ప యను ప్రశ్న దేవలోకములో రేకెత్తి నప్పుడు ఎల్లవేల్పుల ముఖాలు తెల్లబోయి వాక్కులు మూగబోయినవేమో; అప్పుడు నారద మహర్షి ఒక విచిత్ర సమాధాన మిచ్చినాడట ఏమిటిరా! అదే మన పెద్ద భార్య జ్యేష్ఠ పోగా సొంపట చిన్న భార్య లక్ష్మి రాగా సొంపట ఆహా! ఏమి కల్పనా చాతుర్యము. ఈ కవివరేణ్యులు ఇద్దరినీ చిన్నబుచ్చలేదు అదియును తాను చెప్పినట్లుగాగాక నారదమునితో చెప్పించినారు. ఇట్టి యుక్తి చమత్కృతి ఈ కవికోకనికే సాధ్యమగునేమో! కామము గూర్చియు చెప్పవలసిన దంతయు చెప్పినారు. "కమ్రరతి వినోదకారియై తోడ్తోడ సత్ప్రయోజ నాప్త సంతతినిడు" యను నీ పద్యము కామమహిమకు పరాకాష్ఠ. విలాస వినోదములతో మొదలై విశేష ప్రయోజనకారియగు సంతతిని ప్రసా దించు కామము సృష్టికర్తయే యని చెప్పక చెప్పినారు. అందము మరియు నవసరము ఈ రెండును కామ పురుషార్థములో గలవనియు వర్ణించబడినది. "మా హృదంబు జాత మధ్యమునన్ బుట్టు, కామదేవు

మహిమనేమనందు" లక్ష్మీపుత్రుడైన కామదేవుడు యేమి చేయజాలడు? ఏలనన లక్ష్మీ ప్రాపకత్వ బలముచే సకల హృదయ కమలములలో ఎందును కానేరని ఎన్నెన్నో తీయని కోరికలు సృష్టించి తన ప్రభుత్వము నెఱపు చున్నాడు. "అఖిలప్రాణికోటి కందుబాటుననున్న పూరుషార్థమనిన బుడమినదియె" అను పద్యములో తక్కిన మూడు కష్టైక సాధ్యములు దుర్లభములు, కామమొక్కటియే నఖిల ప్రజానీకానికి అందుబాటులో నున్న పురుషార్థమనియు కామ ప్రాధాన్యమును పెద్ద ఎత్తున వర్ణించి నారు. కామమునకు ప్రధానపాత్ర అతివయేకదా. అట్టి యతివనుగూర్చి కవివరేణ్యుని వర్ణనము పతాకాస్థాయినందుకొన్న ఈ పద్యరాజము తిలకించుడు "అందమునఁగండ్ల కౌగిట నదిమి మేని ............... సకలేంద్రియ సుఖాల నొసగు నతివ" పంచేంద్రియములకు కావలసిన విషయ సుఖములవెడి విందు మొత్తమును ఏక కాలమున ప్రసాదించున దతివ యొక్కతే నట! తక్కిన ఏ వస్తు జాలమైనను ఒక ప్రత్యేక పరిమిత కాలమున ఒకొక ఇంద్రియమునకే సుఖపువిందు నీయగలదు. కాంత యొక్కతయే యిన్ని సుఖములను నొకే సమయమున ప్రసాదించునట ఇది ఎల్లరకు పరమ సత్యమేయని తోచినను సామాన్యులకు భేదించి చెప్పరాని పరమ రహస్యము. ఇందు కవి దృష్టి యొక సూక్ష్మదర్శినిగా పనిచేసినది. ఇట్టి కామము ధర్మబద్ధమైననే సత్సంతతినిడి సఫలత గాంచుననియు లేనిచో దుర్గతులకు మూలమగుననియు నొక పద్యములో వచించినారు.

"అఖిల వస్తుతతికి నధికమ్ము విత్తమా ధనమువనితగాంచి దాసి యగును. వనిత నెఱగజూపి వంచించు కామమున్ మించు బలియెవడు ప్రపంచమందు". ఈ పద్యములో కామము యొక్క యపారశక్తి సామర్థ్యములను సరిగా గుర్తించి కవి తగురీతి వర్ణించెను. "అర్థస్య పురుషో దాసః" అను ప్రమాణవాక్యము పరమ సత్యమైనను కాముని ప్రధాన పాత్రయైన వనితనుగాంచి ఆ యర్థము దాసురాలగునట, కేవల కామమే గెలుచుకొనునట. ఒక్కొకపుడు ధర్మమే కామమునకు లొంగి

వచ్చుననుచో అర్థము కామతృప్తిలో నెంతటిది ? ఇట్లు ధర్మార్థములను గెలుచుకొని కామము లోకమునిండా తన నిరంకుశ పరిపాలనను కొనసాగించుచున్నదనియు దానికంటె బలిష్ఠమైన పురుషార్థము మరొండు లేదనియు కామమునుగూర్చి వర్ణించెను, అయినను ఆ బలము వంచకత్వముతో కూడినదనియు విమర్శించినాడు. కామములోని ప్రత్యేకాంశమైన శృంగారమును ఈ మహాకవి సుమృదువుగా సుకుమారముగా సభ్యతా పరిధులను దాటిపోకుండా సరస కావ్యశైలిలో ఒకటి రెండు పద్యాలలో వర్ణించిన తీరును స్థాలీపులాక న్యాయముగా చూపెట్టక తప్పదు. "కొమ్మ మాటున కోకిల కూయునేమొ ............ నడల రాజ హంసలు కాళ్ళబడునోయేమొ". "బాల పెదవి గదల్ప అందముల మూట విప్పు ముత్యాల తీరు". లజ్జావతియగు శృంగారిణి తానొక కొమ్మయనియు ఆమె మధుర వచనములు కొమ్మమాటున కూయు కోకిల కూజితములనియు ధ్వన్యర్థముగా వర్ణించినాడు. అట్లే ఆమె నడకలలో రాజహంసలు కాళ్ళబడుచున్నవట. ఆమె యొక రాజహంస గమనయేకాదు; పదగతి విన్యాస శిక్షణలో రాజహంసలకుకూడా శృంగార విలాసగతులను నేర్పు యధ్యాపిక అవి యందుకే ఆమె పాదాల బడుచున్నవనియు విశదీకరించినారు. అంగాంగములను గూర్చి పచ్చిగా వనితా రూప వర్ణనమును గావించక మృదువుగా శృంగారపు లేతలను మాత్రమే వర్ణించినారు.

ఇట్లే ఇంకను తదితర శీర్షికలనుగూడ, ఈ మహాకవి స్వల్ప స్వల్పముగా స్పృశించి వాని గురించి తన అమూల్యాభిప్రాయాలను, కవితా శిల్పములో చిత్రీకరించి, వానికి ఒక అపూర్వ సౌందర్యమును చేకూర్చినాడు. జ్ఞానవైరాగ్యములుగూర్చి ఈ కవి తన యపూర్వ జ్ఞానానుభూతిని యీ క్రింది పద్యములలో నెంతో యుక్తియుక్తముగా హేతుబద్ధముగా నెట్లు నిరూపించినారో గమనింతము. "గాలితో ప్రపుల్ గాలాబ్ధిఁ దేలియాడు జన్మలను తరంగమ్ముమాలి జలధిఁ జనుచు తీరమును ముట్టునో; మధ్యఁదేటిచనునో ? దీపమున్నపై యిలు చక్కఁదిద్దవలయు" కాలమనెడి

మహాసముద్రమున, ప్రచండ మారుతవీచీ హతుల త్రోపుచే తేచిన తరంగములట యీ జన్మలు. ఇవి యీ అనంత విశ్వజలధిలో తేలియాడుచుఁ బయనించుచున్నవట. ఈ జన్మతరంగములు ఒడ్డును చేరుకొనునో మధ్యనే తీటిపోవునో చెప్పలేము. కనుకనే ఆత్మజ్యోతి యను దీపము వెల్గుచున్న యీలోనే మన హృదయమను గృహమును సంస్కరించుకొని దీనిని ఉత్తమ దేవాలయముగా మార్చుకొని యీ జన్మలోనే తరించవలెనని పై పద్యములో అమూల్య సందేశము నందించెను. "ముందువైపు మోకాలి కీల్మడువలేదు, వెనకవైపు మోచేతి కీల్గొనగలేదు. పరిమితాధికారముగల పురుషవరుడు పరమపురుషుడనేనని పల్కవశమె?" నేడు రేపటి రోజులలో "చెలరేగిన జీవుడే దేవుడను" మిడిమిడి జ్ఞానపు పెనుదుమారమును, కవి మహాశయుడు ఖండించుచు చెప్పెడి పరమ సత్యములివ్వి! తన మోకాలి కీలును ముందుకు ముడుచుకొనలేడు, మోచేతి కీలును వెనకవైపుకు మరల్చుకొనలేడుగదా! యీ జీవుడు. ఈ పురుగు, ఈ యల్పకీటకము ఈ నరుడు తన కొద్దిపాటి శక్తిని గుర్తించికొనక, నేనే పరమాత్మను అని సవాలుచేయుట ఎంత సమంజసమో మీరే యూహించుడని మనకే వదలివైచినాడాబాధ్యతను, ఈశ్వరుని యాస్తిక్యమును శంకించు మానవులనుగూర్చి ఈ కవి వరేణ్యుడేమనుచున్నాడో ఇంచుక పరిశీలింతము "నాస్తికుండు తాను నారాయణుండెలేడనిన ............ వాని కాంతి యరుగఁ గలదె? చూపులేని యంధుడొకడు సూర్యభగవానుడు లేడని నిర్ధారించికొన్నాడట అంత మాత్రమున సూర్యుని, దేదీప్యమాన ప్రకాశములేనిదవునా! అట్లే నాస్తికుడు యోగచక్షువులేని జ్ఞానాంధుడు వాడు లేడన్నంతలో నారాయణుడు లేనివాడు ఎట్లగునని, ప్రశ్నారూపములో ప్రత్యుత్తర మిచ్చినాడు, "ఎన్నిమతములేని యీశ్వరుండొక్కండె ............ అలరంగెదైనఁ బాలొకండె" ఈ పద్యములో ఈశ్వరుని యేకత్వము, ఎంతో చక్కని యుపమానములతో నిరూపించినాడు. ఎన్నోమతాలున్నవి కాని

యన్నిమతాలవారికి ఈశ్వరుడొక్కడే. భాషలనేకములు, వానిలోని భావము మాత్రమొక్కటే. పూలు పలురకాలుగా పలురంగులుగా నున్నవి. అయినను వానిలోని మకరందము మాత్రమొక్కటే. ఆవులు వేలు వేలు రంగులలో నునుచున్నను పాలుమాత్రము వెవ్వేలు రంగులలోలేవు. పాల రంగులో ఈ భేదములులేవు. ఇది పరమసత్యము దీనిని గ్రహించిన వారెవ్వరును, మతముల కీచులాటలో మ్రగ్గక, ఏకేశ్వరోపాసనయే ఉపాదేయముగా తరింతురు, సుఖింతురని కవిగారు ఈ రీతిగా సర్వమత సమన్వయ సిద్ధిని సాధించినారు.

పరమపురుషార్థమగు మోక్షముగూర్చి ఈ క్రింది ఒక్క పద్యములో కవి మహాశయులు చివరి తీర్పుగా ఇట్లు వాక్రుచ్చినారు. "సర్వ సుఖములందు సామ్రాట్టు ............ క్షామ వార్తలేదు" సర్వసుఖములలో మోక్షసుఖము సామ్రాట్టు. ఏలనన అది అక్షయమ్ము, దానికి మృత్యువు లేదు, నరకభీతిలేదు. వయస్సు దిగజారిపోవునేమో, యనుభయ సందేహములునులేవు. కరువు కాటకాలబాధ యంతకూ లేదు తక్కిన కామాది సుఖములకు ఈ పైన జెప్పిన భయసందేహాలుకలవు. నిత్యసత్యానందానుభూతి, యొక్కటె మానవుడు సాధించదగిన మహోన్నతమగు ఏకైక లక్ష్యమని, ఆచార్యులవారు ఈ పద్యముద్వారా లోకమునకు చాటినారు.

పరమపురుషార్థమగు మోక్షమును సాధించుటకు భక్తి, జ్ఞాన, వైరాగ్యాది సాధన సంపత్తి యెంత యున్నను అవి చాలవు. ఆ యనంత పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపమును దర్శింపజేయుటకు, శరన్యాస రూపములో నున్న శరణాగతి యొక్కటియే శరణ్యము. "ప్రపత్తిశ్శరణాగతిః" భగవద్గీతలోని చరమ శ్లోకములో నరునికి సారధిరూపములో నారాయణుడుపదేశించిన చరమోపదేశము శరణాగతియేకదా; "సాధనాంతరమ్ములవీడి సర్వశేషిచరణ యుగళమ్మె నాకెందు శరణమనుచు ........... భారమెల్ల నారాయణు పైనెయుంచి యెపుడు నిర్భరుడై యుంటయే ప్రపత్తి. "ప్రియుని కనుకూలముగ నుండి ............

యెపుడు దృఢబుద్ధి నమ్ముటయే ప్రపత్తి" ఈ రెండు పద్యాలలో గీతా సార సర్వస్వము సంక్లుప్తముగా చెప్పబడినది. సాధనాంతరములైన నానావిధ సామాన్య ధర్మముల గొడవలోబోక, విశేష ధర్మమైన ప్రపత్తియను ప్రావును బట్టుకొని, సర్వశేషియైన అనగా (మిగత అన్నియు నెవనిలో పర్యవసించునో) అట్టి సర్వేశ్వరుని చరణయుగళి, నాశ్రయించి వానినే శరణ్యముగా గ్రహించి, "శరన్యాసము చేయుటయే ప్రపత్తియని, ప్రపత్తికి చక్కని నిర్వచనము చేసినారు. ప్రపన్నుడైనవాడు తన స్వామి యిష్టానుకూల ప్రవర్తనముకలవాడై, స్వామికననుకూలములైన పనులను వదలి సర్వాధికుడైన స్వామినే ప్రేమించి దృఢాధ్యవసాయనిష్ఠతో సేవ సేయుట తప్పనిసరి యని ప్రపన్నుని కర్తవ్య నిర్వచనముగూడ చేసినారు.

"తనకుదానె చెడిడి చెనటి మానవుడెందు
వాని గూడినట్టి వారి జెరుచు
వైద్యుతాగ్ని నంటువాడు చచ్చుటెకాక
అతని నంటువారు హతులగుదురు"

పై పద్యములో మూర్ఖ సాంగత్యము యొక్క దుష్ప్రభావ దుష్పరిణామములను గురించి వక్కాణించుచు, కవివరేణ్యులొక సరిక్రొత్త యుపమానముతో దానిని బలపఱచుటగాననగును. చెనటి, మూర్ఖ మానవుడు తనకు దాను మాత్రమే చెడక తననంటుకొను మానవుల నెల్ల నాశన మొనర్చునట. అది యెట్లన్న విద్యుత్తులోని అగ్నినంటువాడు తానొక్కడు చచ్చుటయెకాక తననంటు వారినిగూడ హతమొనర్చుచుండునుగదా ! ఈ యుపమానము వీరి సునిశిత విమర్శ నాశక్తికి, వీరి యనంత ప్రతిభా సంపత్తికి మణిదర్పణమా ! యన్నట్లున్నది. ఆ సమయమునకు వీరి ప్రతిభ యేయన్వేషణ శ్రమను గొనక ఇట్టి వినూతనోపమా సామగ్రిని వీరి దృష్టి ముందుకు తెచ్చిపెట్టుననియే యనవలెను. ఇట్టి యుపమలు వందలు వేలుగా వీరి లేఖిని నుండి దొరలుటగాంచి, పూర్ణ సిద్ధహస్తులని వేఱె చెప్పనక్కఱలేదు.

"దొరలు నేతలంత; నిరుపేద యాస్తియో ............ లింగ ధారులైన జంగాలవాడలో కోడిమాయమయ్యెఁ గొంపదిసి" "పదుగు రేకమౌచుఁ బదవినిచ్చినయంత............కల్లు కొట్టు దేవునిల్లుగాదు" ఈ రెండు పద్యములు 'అధికార' శీర్షికలోని పద్యములలోనివి, ఇందలి మొదటి పద్యములో కవి మహాశయులు, అధికారుల యధికారమును, నేతల నాయకత్వమునుగూర్చి వాచ్యముగా నల్లతెల్ల, యేమి యనరు గదా! కాని నిరుపేదల యాస్తి జాడదొరుకకుండ దోచబడు చుండుటకు కారకులెవరో తెలియదే! ఆశ్చర్య మాశ్చర్యము; అందరు లింగధారులైన జంగాలే; యా వాడలో మాంసాహారు లెవ్వరులేరు. కాని విచిత్ర మేమన ఆ వాడలోనే; అచటి దచ్చశే కుంపటి యంతకోడి నిమిషాలలో మాయమై పోయినదని, వ్యంగ్యముగా తమ యాశ్చర్యమును వెలి బుచ్చినారు. ఆహా! ఏమి ఉక్తిచమత్కృతి ఎంతటి సముచితమగు సహజోపమాప్రయుక్తి! ఇక రెండవ పద్యములో పదిమంది గూడి యొక దుష్టునికి అధికారము కట్టబెట్టినంతమాత్రాన అతడు గొప్ప యధికారి యని చెప్పరాదు. వందలాది మూర్ఖులు కలిసి ఒక సారాయి కొట్టులోచేరి కొలిచినంత మాత్రాన అది దేవాలయమెన్నటికి కాజాలదు. దేవాలయ ప్రాంగణములో భక్తులసంఖ్య చాల తక్కువైనను దేవాలయము దేవాలయమే యనియుఁ దాని పూజ్యత తగ్గదనియు సెలవిచ్చినారు.

ఇట్లు ఏ పద్యమున కాపద్యమే ఒక సర్వోత్తమమగు నర్థోపపత్తి గలిగి అపూర్వమగు సహజోపమాపుష్టితో అప్రతిమాన స్వారస్య వైశిష్ట్యములు గలదై ఈ కృతికిని ఏతత్కృతికర్తకును మహోన్నత గౌరవ ప్రతిపత్తిని కలిగించుచున్నదనుటలో అత్యుక్తిలేదు. ఈ కృతిని గూర్చి దీని విలువలను గూర్చి నా శక్తివంచన లేకుండా స్థాలీపులాక న్యాయముగా ఈ పీఠికలో దిఙ్మాత్రముగా చూపించ ప్రయత్నించితిని. గ్రంథ విస్తర భీతిచే అతి స్వల్పముగానే చెప్పి ఇంతటితో పరిసమాప్తి చేయుచున్నాను. ఈ కవివరేణ్యుని యందున్న నా సోదరాభిమానమును ఎంతో దూరము

పెట్టి ఒక మహాకవికి చేకూర్చవలసిన న్యాయమును దృష్టిలో పెట్టుకొని ఏతత్కృతి మహాత్వముచే సుపరిభావితుడనై వ్రాసిన ఈ పీఠికను సహృదయులైన కవిపండితులు ఆదరించి మన్నింతురుగాత ! యని సవినయ ప్రార్థన. ఇట్టి అమూల్య సందేశాత్మక మహోచ్చకృతిని యావదాంధ్ర సోదరులకు నీతిప్రబోధక సులభశైలిలో అందజేసిన "శ్రీ వానమామలై" మహాకవి వరేణ్యులకు భగవానుడు శతాయురారోగ్య భాగ్యసంపదలు ప్రసాదించుగాకయని ప్రార్థించుచు ముగించుచున్నాను.

ఇతి శమ్

ఇట్లు

వానమామలై జగన్నాథాచార్యులు

# అభినందన

డా॥ సి. నారాయణరెడ్డి

'అభినవపోతన' ప్రతిభాక్షీరాలయంలో తరగలిస్తున్న మరో తరంగమిది.

లోకంలోని ధర్మాధర్మ విభక్తికీ, అపారానుభవ సంయుక్తికీ తాడెత్తు ఎత్తిన వైజయంతి ఈ 'సూక్తి వైజయంతి'.

ఈ సూక్తులు పురారచనలనుంచి పుణికి పుచ్చుకున్నవికావు. నిత్యానుభవాల కొలిమిలో కాగిన కనకశలాకలు. అందుకే వీటికి అంతమేలిమి.

వరదాచార్యులుగారి సహస్ర ముఖీనప్రజ్ఞకు ఈ సంపుటి ఇంకొక మెచ్చుతునక.

మహాకావ్యం, ఖండకావ్యాలు, గేయకృతులు, నాటకం, నాటిక, వచనకవిత, బుర్రకథ, హరికథ – ఇన్ని ప్రక్రియల్లో క్షుణ్ణమైన తెన్ను 'వరదన్న'ది. ఇంతటితోనే ఆగిపోక ఒక పెద్ద నవలకూడా రచిస్తున్నారు. బొర్రకు తృప్తి ఉండాలిగానీ బుర్రకు కాదుగదా !

అశ్రాంతంగా కావ్యరచనా వ్యాసంగ విశ్రుతులైన వరదాచార్యులు గారు శతధా అభినంద్యులు.

# విషయసూచిక



(రెండవ భాగము)

## అపవర్గ కాండము

శ్రీ వాగీశ్వర్యై నమః

# సూక్తి వైజయంతి

## సూ క్తి మ హి మ

శ్రీకరంబు సద్వివేక ప్రదంబును
శాంతి సౌఖ్యదమ్ము సాధు పథము
కష్ట వితతి నుండి కాపాడు దైవమ్ము
ధరణి నీతి మించు గురువు గలడె ? 1

పాప భీతి గొల్పి పరమార్థ మెద నిల్పి
ధర్మ రూపి యైన దైవ మనుచు
అర్థ వంత మగుచు నలర జీవిత మెల్ల
సూక్తి రత్నములను చూరలిత్తు. 2

# దైవ ప్రార్థనము

వేడ్క విశ్వము సృష్టి గావించు వాని
ప్రీతి భూత రక్షణ మొనరించు వాని
చివరి కఖిలమ్ము విలయమ్ము సేయు వాని
పెద్దలకు పెద్ద యగు వాని బేర్మి నెంతు. 3

మానవాళి మానసముల మసలుచుండి
మంచి చెడ్డల నెపుడు వీక్షించు వాని
సజ్జనుల నేలి కుజనుల సంహరించి
ధర్మమును నిల్పు దేవుని దలంచి కొల్తు. 4

విశ్వమును గుటుంబముగ సేవించువాని
అఖిల ప్రజలకుఁ దండ్రియై యలరువాని
సుతుల నెల్లర సమముగాఁజూచువాని
పెద్దలకుఁ బెద్దయగువాని బేర్మి నెంతు. 5

మంచి చెడ్డల నెద విచారించి యెపుడు
మంచి సేవించి చెడును ద్యజించుబుద్ధి
మంచి నెరిగించు పెద్దలఁ గాంచి మ్రొక్కు
దివ్య బుద్ధి నొసంగఁ బ్రార్థింతు నీశు. 6

ఎంచి తనవలె నొరులఁ బ్రేమించు మనసు
సకల జనుల బాధింపని సత్య వాణి
నీతి నియమము మీరని నిత్య కర్మ
దయఁ బ్రసాదింప నీశుఁ బ్రార్థన మొనర్తు. 7

# ధర్మ మహిమ

మహిని ధర్మమెందు మంచి చర్యల నేర్పు
మంచి నడక కీర్తి మహితుఁజేయు
అలఘు కీర్తి గౌరవార్థ ప్రదంబగుఁ
గాన నరుఁడు ధర్మకలితుఁ డగుత. 8

ఆత్మ కననుకూల మైనట్టి దుశ్చర్య
లొరుల పట్ల సేయకుండు టొకటె
సకల ధర్మ సార సర్వస్వ మనుకొని
తెలిసి మెలఁగ వలయు ధీయుతుండు. 9

ధరణి మానవుండు ధర్మార్థ కామ మో
క్షముల సాధనమ్ము సలుపనెంచి
బుద్ధి జీవి యగుచుఁ బుట్టెను. ధర్మము
పురుషార్థములకుఁ బుట్టినిల్లు. 10

ధర్మ రక్షణమ్మె తన రక్షణమ్మని
తెలియ వలయు నెందు ధీయుతుండు
ధర్మ శత్రు వెందుఁ దా లులాయమ్మయి
యమునిఁ దలసుదాల్చి యరుగవలయు. 11

మహి నధర్మాప్త సౌఖ్య సంపదలకన్న
ధర్మ ఘటిత దుఃఖ దరిద్రతలె యశమిడు
మంచి కీర్తి జీవితమును మించు సుఖము
దుష్టకీర్తి మృత్యువుకన్న దుఃఖతరము. 12

అర్థ కామముల్ ధర్మబాహ్యంబులైన
చౌర్యమై వ్యభిచారమై సకల పాప
మూలమై పుణ్య కల్పాగ మూలములనె
హతి నొనర్చు. ధర్మమ్మె సేవ్యమగు నెందు. 13

దయయె మూలమైన ధర్మ వృక్షమునకు
వర యశః స్సుమాలు పరిమళించు.
తుదల పుణ్య ఫలము లొదవు, తాపము నార్చు
నిత్య శాంతి యనెడి నీడ నొసఁగు. 14

అరయ నాల్గు పూరుషార్థమ్ము లందున
ధర్మమెందు మొదటిదై రహించె
ధర్మ హీన మైన తక్కిన పురుషార్థ
ములన దలయె లేని మొండె మగును. 15

ధర్మ మూల మగుచుఁ దగ నర్థ కాండమ్ము
కామ శాఖ లలరఁ గడలఁ బ్రాకు
అందు మోక్ష ఫలము లాస్వాదన మొనర్ప
మూలములకు జీవనాల నిడుము. 16

అవని నాల్గు పూరుషార్థముల్ సాధింపఁ
బురుషుఁ డెందు జన్మ బొందినాడు
అర్థ కామములనె యాత్మీయము లొనర్పఁ
బురుష జన్మ మెట్లు పూర్ణతఁగను. 17

అర్థ కామము లవి యంగ రక్షణవేయు
ధర్మ మోక్ష యుగళిఁ దనియు నాత్మ
అంగ ధారణమ్ము లాత్మోద్ధరణకునై
యనుచుఁ దెలియలేని యతఁడు నరుఁడె ? 18

అవయవమ్ము లెద్దు లంగమ్ము శకటమ్ము
బండి యెడ్లు నింటిపట్టుఁ జేర
ఇంటికేఁగ మరచి యెడ్ల మేపుటలోనె
ప్రొద్దుఁ బుచ్చుఁ గార్య సిద్ధి గనునె ? 19

ఏవొ పనుల కొఱకు నితర గ్రామమ్మేఁగి
పనులు దీర నుండ వలెనె యచట
సతత ముండు నట్టి స్వగ్రామ మేఁగుట
మరచి యుండు వాఁడు మానవుండె ? 20

ధర్మ ముండు చోట ధైర్యంబు వెల్గురా
తప్పు గల్గు చోట దైన్యముండు
చక్క నిల్చి పెరుగు సారమౌ మాకులు
బొంగు రంధ్ర ముంట వంగు నెందు. 21

తల్లి దండ్రులేని ధర్మాతి రిక్తమౌ
నడకఁ జెప్ప దాని విడువ నొప్పు
తండ్రి మాట వినెనె తాను ప్రహ్లాదుండు
భరతు డమ్మ మాట సరకు గొనెనె ? 22

ధర్మ మార్గ గతులు దప్పి బోధించిన
గురువు నైన సరకు గొనఁగ రాదు
దైత్య గురుఁడు హరికి దానమీరాదన
బలియు నతని నుడికి విలువనిడెనె ?   23

ధర్మ బద్ధ మైనఁ దగ నింద్రియ వితతి
పురుషు మోక్ష ధామమునకుఁ జేర్చు
ముక్కు త్రాడు ప్రగ్గములు లేని యెద్దులు
దారి నడచి యెట్టు లూరుఁ జేర్చు.   24

ధర్మ బద్ధములగు తగు నర్థ కామముల్
అమర కీర్తి సౌఖ్యదములగునిల
ధర్మ హీన ములగ తగు నర్థ కామముల్
అపయశమ్ము దుఃఖ మంద జేయు.   25

అర్థ మెల్ల ధర్మసార్థ కామములకె
కామ మెల్ల మోక్ష ధామమేఁగ
ననుచుఁ దెలియు నతఁడె యాత్మోద్ధరణ కార్య
సిద్ధి నొందగల ప్రబుద్ధుఁ డెందు.   26

ధర్మమె హరియై ప్రోచును
ధర్మమె యముఁడగుచు దుష్ట దనుజుల నేచున్
ధర్మాకృతులు మహాత్ములు
నిర్మల మతి జయము వారిని వలచి వచ్చున్.   27

తగిన చర్య ధర్మ మగుచు సొంపారును
పెదవి నొదుఁగు పల్లు కుదురువోలె
తెగిన పను లధర్మ మగుచు నసహ్యమౌఁ
బెదవి మించు పండ్ల విధము దోచి. 28

ధర్మ మది దినమ్ము తానయి గన్తవ్య
పథము లెఱుక పరచు ప్రాజ్ఞ తతికి
రాత్రియై యధర్మ సూత్రమ్ము దుష్టులఁ
జేర లాగు జార చోర గతికి. 29

ఎవఁడు తాను ధర్మ హీనుఁడై దినముల
బుచ్చుచుండు వాఁడొ పుడమి నతఁడు
తలఁపఁ గమ్మరీని కొలిమి తిత్తింబలె
గాలి పీల్చు విడుచుఁ గాని మృతుఁడె. 30

ధర్మ జీవనమ్ము దాభంగ మందిన
జనము నష్ట పడును శాంతి చెడును
చెరువు కట్ట తెగిన వర సస్య జాలమ్ము
వేరు లూడు భూమి సార మేఁగు 31

ధర్మహీనుఁ డెందుఁ డా భక్తుఁడైనను
వాని భక్తియెల్ల వ్యర్థ మరయ
ఆజ్ఞ మీరు భార్య యత్యంత ప్రేమమ్ము
నొలకవోయఁ బతిని గెలుచుకొనునె ? 32

ధర్మయుక్తభక్తిఁ దలదాల్చు నీశుండు
పరిమళమ్ము జిమ్ము విరిని వోలె
నిష్కళంకుఁడైన నెలవంకఁ దలదాల్చె
బాలు డనక ప్రేమ శూలి తాను. 33

శర్మదంబులైన ధర్మశాస్త్రంబులు
దేవు నాజ్ఞలనుచుఁ దెలియ లేరు
ఆజ్ఞ మీరునట్టి యవిధేయు నిజభక్తు
డంచు స్వామి కరుణఁ గాంచఁ గలఁడె. 34

ధర్మ మోక్షముల్ తటములై తనర నందు
నర్థ కామముల్ జల ప్రవాహమయి పారు
తీరములమించి పారు వాఃపూర మెందు
ఊళ్లకూళ్ల నాశము సేయకుండునొక్కొ! 35

అఖిల మానవతను నదుపులో నుంచగా
జాలు నవని ధర్మశాస్త్రమొకటె
మద గజమ్ము కెందు మస్తకమ్మున నుండు
అంకుశమ్ము కరణి ననవరతము. 36

మనసు బోవు దెసకు మనుజుండు తానేఁగ
మహినిఁ బశువు గాక మానవుండె!
మనసు గోరు కోర్కె మంచిదా చెడ్డదా
బుద్ధి నెరిగి నడచు బుధుడె నరుఁడు. 37

అరయ దొంగ పశువులటు లింద్రియమ్ములు
మదికి వచ్చినట్లు మసలఁ జూచు,
ఘన వివేక దండమును గేలగొని ధర్మ
బుద్ధి వాని నెందు హద్దువెట్టు. 38

సంఘ విహిత చర్య శాస్త్ర ధర్మంబగు
విమల ధర్మ విదుల విబుధు లంద్రు
ధర్మభంగ కరుల దైత్యులుగా నెంచి
హరియె వారిఁ జంప నవతరించు. 39

ధనము తస్కరుండు తా దోచుకొనుదాక
కామమెల్ల వయసు గలుగు వరకె
ధర్మమదియొ వ్యక్తి తా నశించిన బోదు
ధరణి కీర్తిరూపత న్వెలుంగు 40

ధర్మశక్తి కన్న ధరణీ పతి యెవండు
ధర్మలబ్ధి మించు ధనమదేది ?
ధర్మసూక్తి కన్న ధర వేదమెయ్యది
ధర్మమునకు మించు దైవమేది ? 41

ధర్మవర్తనునకు దారిద్ర్య మొదవినన్
మనుజులందు వాని ఘనత చెడునె
నీరహీనమైన శారద మేఘముల్
ఉన్నతాసనముల నుండకున్నె 42

అమల విద్య లెప్పుడభ్యసించుటఁ జేసి
సాధుజనుల స్నేహ చర్య వలన
పూర్వజన్మ ఘటిత పుణ్యాతిశయమున
ధర్మ వర్తనమున దగులు మనము. 43

ధర్మరక్షకుండు తన రక్షకుండెందు
ధర్మవైరి తనకు తాన వైరి
అరయ ధర్మరూప మాత్మ రూపంబని
తలఁచు వాడె భువిని నిలుచువాడు 44

కామదేవతా! నీవెందుఁ గరుణతోడ
మదిని మోక్షమ్ముగోరు కామనలనిమ్ము
అర్థరూపిణీ లక్ష్మి మాయమ్మ నీవు
ధర్మ కార్యాల వెచ్చింప ధనములిమ్ము. 45

## అర్థ మహిమ

అర్థవంతు పలుకు లర్థవంతంబులై
వాసికెక్కు నెందు వాస్తవమయి
అర్థహీను వాక్కులడుగు వాఁడే లేక
విధవ వయసువోలె వృథగ నేఁగు. 46

అర్థరూప మూని యవతరించిన లక్ష్మి
నెపుడు విష్ణుమూర్తి యెద ధరించు
విముఖయైన లక్ష్మి విష్ణులీలా జగ
న్నాటకంబుదైన యాటకట్టు 47

అరయ నాల్గు పూరుషార్థమ్ము లందున
నర్థమది ద్వితీయ మయ్యు, నెందు
నద్వితీయ మగుచు నలరు. నర్థములేని
దడుగు ముందు జరుగ దవనిలోన. 48

తెల్లవారినంత నెల్లజనమ్ములున్
పైస పైస యని జప మ్మొనర్తు
ధనముకన్న మిన్న దైవమింకే ముందు
ధనము గడన సేయఁ దలఁపు మెందు. 49

అరయ విష్ణుభార్య లిరువురి లోపల
నందకత్తె యెవ్వరనుచు నడుగ
జ్యేష్ఠ పోగ సొంపు చెల్లెరాగా సొంపు
అనుచుఁ దీర్పు చెప్పెనమర మౌని. 50

ధనమె రక్షసేయు ధరణీ జనమ్ముల
ధనము లేనివాడు తృణ సముండు
ధనమె ధైర్యమొసగుఁ దగనాపదలయందు
పైస మించు నాత్మబంధువెవఁడు ? 51

కులమదేదియైన గుణము లేకున్నను
చదువు సంధ్య లేని జనుఁడెయైన
రూపహీనుఁడైన పాపాత్ముఁడైనను
ధనికు గౌరవించు జనము లెందు. ! 52

పైసగూర్ప వలయు పదివేల యత్నమ్ము
లాచరించియైన నవని నెందు
ధనపు పెట్టె చుట్టు జనములు బెల్లమ్ము
నంటి మూగు చీమలట్లు సాగు. 53

ఆదరింత్రు కూర్మినాలును బిడ్డలున్
బలుకరింతు ప్రేమ బంధుజనులు
అఖిల జనులు విష్ణువటు కొల్చుచుందురు.
తాను లక్ష్మిచెంత దనరి నంత. 54

ధనికుఁడాడు మాట ధర్మ శాస్త్రంబది
ధనికు నడలు మార్గ దర్శకములు
ధనికు డాపదలకుఁ దా నాదుకొన గల్గు
ఆత్మ బంధు వందు రవని జనులు 55

ధనముఁ గాంచి విద్య తల వంచికొని నిల్చు
ధనము నొద్ద బలము దాసుఁడగును
అందు కొఱకె లక్ష్మి నాశ్రయించి మురారి
అజ హరాదులకును నధికుఁడయ్యె 56

ధరణి జనుల ముందు ధనమున కున్నంత
విలువ యన్యవస్తువులకు లేదు
డబ్బటన్న బ్రదుకు డబ్బా యటంచును
శవముగూడ నోరుజాచు లేచు 57

ధరణి జనులకెందు ధనముతో నున్నట్టి
యవసరంబు చెప్పనలవి గాదు
చచ్చిపోయినట్టి జయభేరి చర్మంబు
తట్టికొట్టి చూడ ధన ధన మను 58

విద్య గొప్పదనము విబుధు లందే యొప్పు
బలిమి గొప్పదనము ప్రధన మందె
పదవి గొప్పదనము ప్రాంతమ్మునకె యొప్పు
ధనము గొప్పదనము ధరణి కంత 59

ధనము గల్గు వాడె ధరణిని గలవాఁడు
లేనివాఁడు పృథ్వి లేనివాఁడు
చెరువులోన నీరు బరఁగు నందాకనె
బ్రదుకుబాట చేప పదువులాట 60

రమ్ము రమ్మటంచు రాఁగోరు లోభిదా
యంద నుండు లక్ష్మి దండి ప్రేమ
పొమ్ము పొమ్మటంచుఁ బోఁగోరు త్యాగిదా
యంద నుండ వెఱచు నటులె లక్ష్మి 61

సకల కామనలును సఫలతంగాన నిత్య
మఖిల భోగసుఖము లంద వచ్చు
త్యాగ వృత్తి శాశ్వత యశమ్ము గానవచ్చు
ధనము గడన సేయ దలపవలయు. 62

ధనము గూర్చి వృథగ దాచియుంచకు మెప్డు
దాన సౌఖ్య పడుము దానమిడుము
తేనెటీఁగె గూర్చు తేనియతైరు వరుల్
కొల్లఁ గొట్ట జూతురెల్ల వేళ 63

పురుషు లెల్లరవని బూరుషుల్ గాబోరు
స్త్రీలనెల్ల రటులె స్త్రీలు గారు
చేత డబ్బు గల్గ స్త్రీ యేని పురుషుండె
ధనము లేని పురుష డనిన స్త్రీయె. 64

పులి మేక యగును ధనముం
దిలకించిన యంతమాత్ర నెటిమేకయు బె
బ్బులియౌను ధనము చేతం
గలిగిన మాత్రాన నెందు కలియుగ మందున్ 65

ఆకలికిని యన్న మాతప శీత వ
ర్షాది బాధలుడుపు నట్టి యిల్లు
ఆత్మ మాన రక్షణార్థమ్ము వస్త్రమ్ము
ధనము గాక యన్యమును గలాదె! 66

విష్ణుదేవుఁడెందు విభవావతారముల్
పట్టుమన్న నొక్క పదియె తాల్చె
కోరికలను దీర్చు కోట్ల్యవతారముల్
దాల్చుఁగాదె యెపుడు ధనములక్ష్మి 67

ప్రాణమేఁగు పిదప ప్రతి మానవునికిని
కాల్చఁబూడ్చ ధనము గావలయును
చచ్చిపోయినట్టి శవమున కైనను
అరసి చూడ డబ్బు లవసరమ్మొ 68

వయసు చనిన నెట్లొ బ్రతుకవచ్చును గాని
పైస చనిన నాత్మబలమె పోవు
నఖముపైన రూక నాట్యమాడినదన్న
అవని యతని కరతలామలకము 69

ధర్మ పూర్వకముగ ధనము నార్జించిన
కీర్తి వచ్చు సౌఖ్యపూర్తి హెచ్చు
ధర్మ విరహితముగ ధనము సంపాదింప
నిందఁ జెందు దుఃఖ నిరయమొందు 70

సుదతి దాల్ప శృంగారమై సొంపు గూర్చు
అవసరములను బంగారమగుచుఁ దీర్చు
ప్రభువు కడనాణెమై ప్రభుత్వము నొనర్చు
ధనమె సకల సుకార్య సాధనము భువిని 71

కల్లలాడిబేరి గణికవృత్తిన్నారి
దొంగతనపు పనులతో బికారి
నిందకోర్చియైన బొందిలో బ్రాణమ్ము
నిల్పుకొనగ ధనమునే గడింత్రు 72

అన్నదమ్ములేని యమ్మ నాయన గాని
ఆలుమగలె కాని యాప్తులేని
ప్రాణతుల్యులైన బంధువులేనియు
పైస విషయ మదియె పగ నొనర్చు 73

జబ్బునడఁచు మందు డబ్బుల కంటెను
చావుకగు వ్యయమ్ము చవక యేని
మరణ మెందు లాభకర మంచు భావించి
చావునే వరించు జడుఁడు లోభి. 74

ఆశకొక్క ప్రాణమనుమాన సంస్థాన
మరయ భయమునకును నాశ్రయమ్ము
మదమునకు బలమ్ము మనికి లోభమునకు
అల్పులకును ధనము లబ్బునెడల 75

త్యాగ లతలు ప్రాకఁదగు పట్టుగొమ్మయు
పుణ్య కార్యములకుఁ బుట్టినిల్లు
పేదసాదలకును భిక్షాన్న సత్రంబు
ధర్మగుణుల కెందు ధనములమర. 76

ఘన యటంచు మ్రోగు గంటఁ బూజింపరు
ధన యటన్న భేరి డబ్బు లిడరు
కోర్కిలేక జనుల కోర్కె దీర్చెడి దైవ
ప్రతిమ కెందు పూలు పైసలబ్బు. 77

రెండు నాల్క లెందు నుండి యుండుటలును
వంక దారులందు వడి జనుటలు
పెట్టెయందొ మరియు మట్టిలో నుంటయొ
ధనమునకును ఫణికిఁ దగును జంట. 78

## కా మ మ హి మ

క్రమరతి వినోద కారియై తోడ్తోడ
సత్ప్రయోజనాప్త సంతతి నిడు
మా హృదంబు జాతమధ్యమ్మున జనించు
కామదేవు మహిమ నేమనందు. 79

జ్ఞాన జనిత మోక్ష ఘన సౌఖ్యమన వన
ప్రస్థితులకు యతికి ప్రాజ్ఞతతికి
బ్రహ్మచారి వేదపఠనధర్మ మెఱుంగు
అర్థ కామములు గృహస్థునకయి. 80

ఐహికమున సుఖము లన్నిటి సమకూర్చు
భవ్య పూరుషార్థ భాగ్యమదియె
కామ మనగఁ బరఁగు గాదె యర్థార్జన
సకల కామపూర్తి సాధనంబు. 81

కామ మవని బుట్టు కామధేను వనంగ
సకల విషయ సౌఖ్యసార మిదును
అఖిల ప్రాణికోటి కందుబాటున నుండు
పూరుషార్థ మనిన బుడమి నదియె. 82

మోక్ష సేవనమున మొలకెత్తు సుఖముల
బుద్ధి యాత్మశాంతిఁ బొంది మురియు
కామమును భజించి గడియించు సుఖముల
దేహ మింద్రియములు తృప్తి నొందు. 83

బుద్ధిలోన ముక్తి బొందు వాంఛ జనించు
సిద్ధి గాంచు జ్ఞాన సేవనమున
స్వాంతమందు కామజాలమ్ము జనియించు
అర్థమును గడించి పూర్తి జెందు. 84

ధనము, వనిత, కామమునకు లక్ష్యమ్ములు
ధనము గాంచి వనిత దరికిఁ జేరు
సకల సుఖములందు సామ్రాట్టు స్త్రీసుఖ
మందమొకటె దాని యస్త్రబలము. 85

కామ సౌఖ్యముననె కల్గు సంతానము
సంతు వలన గలుగు సద్గతులును
అవని కామసుఖము లైహికాముష్మిక
ప్రదము లనుట లవి యబద్ధ మగునె ? 86

అందమైన స్త్రీని నవనిపై సృష్టించి
కామ మొదవఁజేసె గాంచినంత
అన్ను కన్నమిన్న యాకర్షణ మొకండు
కలదె ? దానికై సకల మొసంగు. 87

అందమైనచూపు లాకర్షణ మొనర్చు
మందహాస మొల్కి మచ్చుఁ జల్లు
కౌగిలింత త్రాళ్ళ గట్టిగా బంధించు
మదన కదన రతుల మదినె గెల్చు. 88

ముఖము తమ్మి మల్లెమొగ్గలు పలుచాలు
కనులు కలువ లధర మన నశోక
సుమ మురోజ యుగళి చూతమంజరు లివి,
మారుశరము లెందు నారి, నారి. 89

లేమ తారుణ్య నందనా రామసీమ
కంతుఁ డెదవొంగ బంగారు బంతులాడు
రమణి సౌందర్య దివ్య నిర్ఝరులయందు
ప్రేక్షకాక్షి దృఙ్మీనముల్ పెనఁగులాడు. 90

మీలతో నాచుఁ బెనఁగు పద్మాలతోడ
తడలు జెడనల్ల సుడిగొని బుడగ లెగయ
స్వర్ణ సౌందర్య దివ్య శోభాస్రవంతి
పారు నేఱులై సొంపారు పడతి మేన. 91

తీవఁ బోండ్లు స్వప్రభువులక్రేవఁ జనఁగ
మొదట గొంకెద రాపయి వదలలేరు
పాదపముల మున్ముసు లతల్ ప్రాకికొనుట
తెలియనట్లుం దలమికొన్న దొలఁగలేవు. 92

పొటమరిలనె ప్రాయము తీవబోఁడు లాది
నంతరంగము విప్పి మాటాడ రెండు
పూఁతఁ బట్టనె మును లతాముఖము లందు
మూతి విప్పని మొగ్గలె మొలచునట్లు. 93

పలుకుటకు మొగము లేకయు
నలువురిఁ దలియెత్తి సరిఁ గనం జాలకయున్
వలపించు ముగ్ధ చేష్టల
తలవంపులు బొంది సిగ్గు తానే గెల్చున్. 94

ప్రణయ లోకమ్ము బహు సూక్ష్మ వసతి గలది
అందు రెండవ వ్యక్తి రా సందు లేదు
సతిని పతినను భేదమ్ము సమసి పోవ
దంపతులె యొక్కరై యందు దనరు చంద్రు. 95

కమ్మ విలుకాని యమ్ము లబ్జమ్ము లెందు
తమ్మ లనబడు కల్కి నేత్రమ్ములకును
మగువ వదన సౌందర్య రమాసమార్హ
నియతి మాసమ్మునకు తూగి నెలయగు శశి. 96

కుదురైన సఖి మనోహర
వదనము కుందనము గరఁగి పడియచ్చున నే
ర్పొదవం బోతం బోసిరా
ముదిత యొడలి సొగసు శిల్పమున మలచిరొకో. 97

వనిత యధర పల్లవము హాస సుమములు
స్వర్ణకుచయుగమ్ము సరసత యను
కామునిం బ్రసన్ను గావించు పూజకై
పత్ర పుష్ప మధురఫల జలములు. 98

పూల బాణాల తోడనె శూలి గుండె
లదరఁగొట్టి రెండొకటిగా నతుకు వెట్టి
గంగనా దలఁ దాల్పగా లొంగదీసె
చచ్చి పుట్టిన మరున కసాధ్య మేది ? 99

ఎందు హరికి లక్ష్మి యెదలోనె మెదలును
ఉమను నతుకుకొనియె యుండు హరుఁడు
ఎపుడు నోట వాణియే యుండు నజునకు
కాంతలకును వశుఁడు గాదెవండు ? 100

అందమునగండ్ల, గౌగిఁట నదిమి మేని,
ఆస్య పరిమళమ్ముల నాస, నధర సుధల
జిల్కు నాల్కను, సరసాలఁ జెవులఁ దన్పి
యొకట, సకలేంద్రియ సుఖాల నొసఁగు నతివ. 101

తరుణి సర్వాంగ సుందరి సరసురాలు
సాధ్వి యనురాగవతి కళాచతుర సుఖద
వలచి గృహలక్ష్మియై వచ్చి నిలిచెనన్న
సంపదల వేల ? వానికి స్వర్గమేల ? 102

అందకత్తె మేల్జవ్వని యదొక తీరు
సుంద రాపాంగములఁ జూచి మందహాస
భాషలం బల్కరించి జార్పయఁట నల్ల
సవరిచిన పిచ్చివాఁడు గాఁడెవఁడు తాను. 103

మగకులమ్ము గెల్వ మహి దీక్ష బూనిన
మరుకటారిగాని మగువ యగునె
అందుకొఱకె దాని నారసి దాసోహ
మనక తప్ప దెంత ఘనునకైన. 104

సుమశరుండు నారిచూపులన్న గవుల
స్తన యుగమ్ము శరములనుగ గూర్చి
తనువు ధను వొనర్చి తన్మధ్య భాగమ్ము
ముష్టినొదుగ సూక్ష్మము నొనరిచెనొ. 105

అతివ భార్యయైన ననురాగ వల్లియౌ
తల్లియైన పాలవెల్లియగును
అతివ యువతి యైన నందాల మల్లెయౌ
వృద్ధ యైన జ్ఞానసిద్ధ యగును. 106

కామమదియొ శుద్ధికర ధర్మబద్ధమై
ప్రేమరూప మగుచు పేరు గాంచు
కష్ట సుఖము లందుఁ గలిసి యుండును ప్రేమ
కామ మైత్రి సుఖము గల్గ వరకె. 107

భార్యదుష్ట కామ బ్రదుకుండగనె చంపు
పతికి నపయశమ్ము వెతలు గూర్చి
భార్య ధర్మకామ పతిదేవునిలు దీర్చి
వంశమునకె గౌరవమ్ము గూర్చు. 108

పరుని వద్ద నెంత ప్రతిభ యుండిన నేమి ?
తరుణి వలచి నతఁడె దాని మగఁడు.
తమ్మి రవిని వలచెఁ దద్గతిఁ జెంగల్వ
శశిని వలచె జెప్పవశమెఁ వలపు. 109

కామమునకె యర్థ గౌరవం బేపారు
కామమునకె ప్రేమ ఘనత మీరు
ప్రాణికోటి మనికి బరఁగు కామమునకె
ఇతర పూరుషార్థ గతియు నిదియె. 110

కామమెందుఁ దాను కల్యాణ కారియై
పీడకుండి వయసుతోడ నెదిగి
సతులఁ బతులఁ గూర్చి సంతును సృష్టించి
మమత మీరఁ బెంచి మనుచు జగతి. 111

మరుని భాగ్యలతయె మానిని మైదీవ
యగుచు రాగదృష్టులై చిగిర్చి
నగవులగుచుఁ బూచి నవ వాసనలఁ జిమ్మి
కనక కుచయుగమ్ముగా ఫలించు. 112

వీరవర్యుఁ డెదుటి వీరుని గెల్వఁగా
చావునకుఁ దెగించి సల్పుఁబోరు
సుందరాంగి నవ్వి చూచిన, జాలుఁ దా
నెట్టి వీరుఁడేని పట్టు వడును. 113

ధర్మ శిక్షణలకుఁ దగియుండు బాల్యంబు
కామ భోగములకుఁ గల్గు యువతి
అర్థ సంగ్రహమున కలరెఁ గౌమారంబు
వార్ధకమ్ము మోక్ష వాంఛ కొదవె. 114

ధర్మ బద్ధమగుచుఁ దగియుండు కామమ్ము
సంతు గల్గజేసి సద్గతి నిడు
ధర్మ రహిత మగుచుఁ దనరిన కామాప్తి
సమయుఁ గీర్తి వంశసంకర మగు. 115

ఇంద్రియముల స్వవిషయేచ్ఛయే కామమ్ము
కామనలు ఫలింపఁ గల్గు సుఖము
పరసుఖమ్ము కెందు భంగ మ్మొనర్పని
కామనిరతి ధర్మగతి యటంద్రు. 116

అఖిల వస్తు తతుల కధికమ్ము విత్త మా
ధనము వనిత గాంచి దాసి యగును
వనిత నెఱఁగఁ జూపి వంచించు కామమున్
మించు బలి యెవఁడు ప్రపంచమందు. 117

విష్ణురూపుఁ డగుచు వెలయును ధర్మంబు
కామరూపి దానిఁగన్న కొడుకు
తండ్రి మాట వినిన తనయుఁ గాల్చె హరుండు
మాట వినిన గంగ మౌళిఁ దాల్చె. 118

కామమున్న బ్రదుకు గల్గి వెల్గు మనస్సు
ధర్మమున్న శాంతిఁ దనరు బుద్ధి
అర్థమున్న బలిసి యాడు నహంకృతి
మోక్షమున్న నెందు మురియు నాత్మ. 119

సకల కామ గతులు సఫలతం గనుచుంట
కలిగినట్టి వారికడనె కాదె
చిత్తజాత వాంఛ విత్త లక్ష్మియె తీర్చు
తనయు కోర్కెఁ దీర్చు తల్లి యగుట. 120

ప్రేమ పాశ మగుచుఁ బెనవేయు చూపులు
కాల పాశమగుచుఁ గ్రాలు నొకట.
వేయి మాట లేల? విపరీత వేళల,
నారి మృత్యు ముఖము దారి యగును. 121

నాడులకు నవ జీవమ్ము మోడు లైన
ప్రాణ తరులకు పల్లవ ప్రద వసంత
మంతరంగపుం గోఁతకు నతి ప్రశాంత
మైన యమృతంపు బూఁత యర్ధాంగి స్పర్శ. 122

సూ

తరుణి క్రొత్తలోన త్వరగ నానక యుండు
చెప్పినట్లు వినగ సిగ్గు జెందు.
త్వరగఁ గ్రొత్త బట్ట తడియ కుండును నీట
ఒంటదాల్ప సరిగ నొదుగ కుండు. 123

ప్రణయ సంగత విరహంపు బాధ లోర్వ
తరము గా దల కందర్ప హరున కైన
విరహపుం బ్రేమ వధ కష్ట తరము దీన
ప్రాణములు తెగ వసి కోఁత పాసి చనదు. 124

హృదయ సదనమ్ము ప్రేయసి కిచ్చివేయ
వెలది దానికి విరహాగ్నిఁ బెట్టి పోయె
వేరె దిక్కు గానక యేడ్చు విరహ తాప
ప్రయణ మది కోరికొని తెచ్చికొనిన చావు. 125

వేదనల మహానందము, రోదనముల
గాన మాధురి యద్వైత ఘన సుఖాప్తి
ప్రేమ తరు దోహద క్రియ ప్రేయసి కయి
విలువ నిడరాని కానుక విరహ మనిన. 126

హృదిని విడని ప్రేయసికినై యేల యిట్లు
విరహ వేదనం గుందుట మఱపు రాని
భావ నామయ ప్రణయ ప్రపంచ మందు
కాంక్ష చల్లారదు విరక్తి గల్గ బోదు. 127

విరహి లోక సంతాపక స్మర కృశాను
గోళ సంధుక్ష ణోద్ధూత గోవికీర్ణ
విస్ఫులింగ సంతతులన విధుని చుట్టు
తారకారాజి వెల్గు నపారములుగ. 128

కమల సుమ గర్భగత మధుకణ వితాన
మే విరహిణీ ప్రణయ పూర్ణ హృదయ సుధయొ
మధు వచటఁ గ్రోలి యాడెడి మధుపములుగ
నెవని కామాంధకారము లెగసి చనునొ. 129

కలువతీవ పడతి వలుద మొగ్గలపయిన్
బచ్చ రేకు పటము పాయ నలఁ
దానమాడు సరసిఁ దాని కొంచుచు శశి
చిక్కిపోవు విరహి చింత నేమొ? 130

అరుగుదెంచు మిత్రుండిక యరుగు ననిన
ప్రకృతి రాగరంజిత యయి పరఁగు రాక
రాక వచ్చుట దవ్వుండి పోకడ యను
సంధి కాలమె రాగప్రసారకమ్మొ. 131

మెఱపు తీవ కౌగిఁటఁ బడి మేఘ మపుడె
కరుఁగక యొకింత సేపు నాగఁ గలదేమొ
కాని ప్రియకాంత కౌగిలి ననుకొనఁగనె
కఱఁగి లేనటులగునేల? విరహి మనము 132

కన్నె లత నాచిలిపిగాడ్పు చిన్నవాఁడు,
పచ్చ చీటి చీర చెఱఁగు వట్టి లాగఁ
బ్రణయ హృదయ వాసన బయల్పడఁగ నామె
నవ్వు నతనితోఁ బువ్వు చిన్నారి నోట. 133

మోహ సమ్ముగ్ధయా జాజిమొగ్గ చుట్టు
గుస గుసల్వెట్టు పవను గన్గొనుచు నామె
నాకును న్నీపయినె వాసన ల్గలవన
నోరు విప్పియు లజ్జించి యూరకొనియె. 134

మధుకరా! నాదు నవకమ్ముమాసి యెల్లి
ధరణి వ్రాలకముందె యీతరుణ హాస
మధురసాస్వాద నోన్మత్త మహిత సుఖము
గొను మనుచు జాజి పూల వాసనలు వీచు. 135

చిన్నతన మింక విడకయె సిగ్గు మెయినొ
వచ్చుటకుఁ జిక్కులిడు లతా వనితఁ గాంచి
సూటి నడయే తెలియు వృక్ష సుందరుండు
మును వెనుక దోచక నిలిచి ముగ్ధుఁడగును. 136

భర్తృ సంశ్లేష మించుకఁ బాయలేక
సహగమనముం బొనర్చిన సాధ్వియెవరొ?
మారుజన్మాన వల్లీకుమారి యగుచు
తరువరాశ్లేష మొనరించి ధన్యయయ్యె. 137

వనిత ప్రేమ దృగ్రుచి రగుల్కొనుచు నెదకు
అంటుకొనిన యీ కామ దవానలమును
మలయ మారుతమ్మరె యుసికొలుపు ననఁగ
వెన్నెలలు నేయిప్రేల్చు నీ ప్రేల్కియందు. 138

నాధు హృదయ సర్వస్వ మున్నట్టు లుండి
యపహరించిన ముష్కరు లగుట నేమొ
యతని ముందు నిలువలేక యమిత భీతి
యిటటు పరువెత్త సాగునో యింతి కనులు. 139

ఈ యుభయ లోక పరిధుల నిట్టె వీడి
ప్రణయ లోకాల విహరించు మనసదేమొ
నాతి సౌందర్య దివ్యానుభూతి యందు
గాంచు ప్రతి యంగమునను స్వర్గాలు వేలు. 140

అంతరంగ వాసనన రవ్వంత గూడ
మోమువిప్పి తెల్పగలేని మొగ్గవోలు
మౌగ్ధ్య సంజాత లజ్జాప్త మౌఢ్యమందు
లగ్న యోగంబు లెటుగల్గు లలనతోడ. 141

ఎందు ప్రేయసీ ప్రియులను నెడ పరుచఁగఁ
జూచుచుండెను లజ్జాపిశాచ మౌర
అలముకొన జూచు తరు లతా భ్యంతరమున
పీచి పిడఁగొట్టు వడిగాలి విధము దోచు. 142

వనిత పాపట మేఘాన వరలు మెరపో
నడిమికిం జీకటులఁ జీల్చునడు పథమ్మొ
వేనలిన్ వెలుంగునవవి విరుల సరులొ
సఖి విరహమంటి మరియు ఆశాలతికలొ 143

అమిత గాఢాంధకారము లావరింప
వరుని ప్రణయావలోక తస్కరుఁడు పొంచి
అతివ రూప యౌవన ధన మపహరింప
మందహాసమ్ములను మచ్చుమందు చల్లె. 144

ముట్టబోవు నాథునిగాంచి ముగ్ధ తాను
అత్త పత్తికొమ్మ విధాన నంగమెల్ల
ముడుచుకొని సిగ్గుమొగ్గయై ముందు వెనుక
లాడు మరునారియై ధృతివీడఁ జేయు. 145

కుంచిత గాత్రమ్ముల సతి
చంచల నేత్రముల రుద్ధచరణమ్ముల ల
జ్జాంచిత వదనమ్మున కిలి
కించితవతి యగుచుఁ బ్రియుని కేలన్ వ్రాలున్. 146

కాంత కనులకు దవ్వుగాఁ గలుగునేమొ
నాదు మదివీడి చనఁగ నా నాతితరమె?
కలువలకు శశి దవ్వుగాఁగలుగునేమొ
కొలని యంతరంగము వీడగల దదెట్లు? 147

వరకళా వినోదకర కావ్యమ్ము తాను
సదుపదేశ ప్రయోజనప్రద మగునటు
కామ మది విషయ వినోదకారి యయ్యు
సద్గతి ప్రయోజనకర సంతతి నిడు. 148

కొమ్మమాటున కోకిల కూయునేమొ
కలికి నవ్వులఁ జిలుకలు పలుకునేమొ
మాగతివి నీవెయని శరణాగతి గొని
నడల రాజహంసలు కాళ్లబడినవేమొ. 149

బాల పెదవి గదల్ప పల్వరుస తీరు
అందముల మూటవిప్ప ముత్యాల పేరు
నాతి క్రీగంటగను వీక్షణముల చాలు
దివ్య సౌందర్య సరసిలోఁ దేలు మీలు. 150

వదన శశిని సుధాపిండ భ్రాంతిఁగొనగ
తగవులాడు బేడిసలగు తరుణి దృశలు
విరియు మందార కుసుమాన మెఱయుచున్న
మంచు ముత్యాల సరులు కోమలి నగవులు 151

పుణ్య లావణ్య దుగ్ధ సముద్రము లన
సరస శృంగార వాత్సల్య ఝరులు దొరలు
మధుర జాయాత్వ మాతృత్వ మహిత గిరుల
స్వర్ణ శిఖరమ్ము లన నొప్పు స్తన మిథునము. 152

రమణి యెదఁ బొంగు తారుణ్య సుమ మనోజ్ఞ
మోహ మధువుల నీలాల మూతలమరు
సుమృదు లలిత సువర్ణభాండముల నింపి
అధర మధుపాత్ర ప్రియునకు నందఁజేయు 153

పసిడిలో మార్దవమువేసి ప్రతిమచేసి
జీవములు వోపి శృంగార భావరాశి
అంగములుదాల్చి వచ్చుట లతను రతికి
సవతి యనిపించు సుందరి యువతి తాను. 154

జీవములు పడి కదలాడు శిల్పలోక
సుందరియొ నిజ సౌందర్య సుధల బంచి
యనిమిషులజేయు భువన మోహినియొ లేక
సూనశరు జయలక్ష్మియో సుదతి తాను. 155

## విద్యామహిమ

దొంగవాని కెందు దోచరాని ధనమ్ము
పొరుగు కిడిన నొడిసిపోని సొమ్ము
క్షితిని విద్య యొకటె చెడని పదార్థమ్ము
విద్య సాటివచ్చు విత్తమున్నె! 156

విత్త మెంత యున్న విద్య లేకున్నచో
నుచిత గౌరవమ్ము నొందునెట్లు
బొజ్జ మాత్రముండి బుజ్జిలేకున్నచో
పూజ్యతముఁడు గాఁడు పురుషుఁ డెందు. 157

విద్యలేని నరుఁడు విభవ మెంతయునున్న
మంచిచెడ్డ తెలిసి మసల లేడు
అలిచిప్పలైన యంధుని నేత్రముల్
నాణ్యమైన దారి నడువలేవు. 158

విద్యయుండి మనిషి వినయమ్ము లేకున్న
ప్రాజ్ఞజనుల మెప్పు వడయలేడు
మగని మాట వినని మానిని రంభయేన్
బంధుజనుల మెప్పు వొందునెట్లు. 159

అర్థ మెఱుఁగనట్టి యఖిల విద్యలు గూడ
వ్యర్థమనుచుఁ దెలియ వలయు నరుఁడు
శుకము పలుకు నేర్వ శుకునట్లు సత్కార
యోగ్యతను వహించి యొప్పఁగలదె. 160

బాల్యమందు కష్టపడి విద్యనేర్చిన
బ్రదికియున్ననాళ్లు వడయు సుఖము
తలకు నింటి బాధ్యతలు లేవు కామాది
మలిన వృత్తులెదను గలఁచవందు. 161

అలస మతిని, గురుని యాజ్ఞ పాలించని
వాని, శ్రద్ధలేని వాని, రోగి,
సుమతి గాని వాని, సుఖలాలసుని గాంచి
దరికిఁబోదు శారదమ్మతల్లి. 162

బాల్యదశ యటన్న భావిజీవత సుఖ
క్షేత్రమందు నాటు విత్తనమ్ము
విత్తనముల దినెడి పీరిడి యెందేని
పంటలాభ మాసపడఁగ దగునె. 163

తల్లిఁ దండ్రి గురువు దన కన్న బెద్దలఁ
బరిభవించునట్టి బాలుడెందు
ఎలమి చెట్టు నెక్కి యెక్కిన కొమ్మనే
కొట్టివేసికొనెడి కుమతిగాదె. 164

గురు కృపాపాత్రుఁడై శిష్యుఁ డెరుఁగకున్న
అఖిల విద్యావివేకము లబ్బుటెట్లు
తరచుగా శాణశిలతోడ నొరయకుండ
జాతిమణియు దానెటు ప్రకాశమును గాంచు. 165

కళలు ప్రతిభాన్వితులలోన ఘనతమీరి
వెలుఁగునవి మందబుద్ధిలో మలుగుసూపు
లలిశరత్తులో శశికళల్ వెలుఁగులీను
అటులె వర్షర్తు వందు మాంద్యమును బూను. 166

కల్లుమత్తు నాల్గుగడియలే యుండును
ధనపుమత్తు లేమి దనరుదాక
చెలువ మదము వయసు నిలుచు నందాకనె
విద్దెమదము జన్మవెలయు వఱకు. 167

అజ్ఞులందు వెల్గు నల్ప విద్వాంసుఁడు
విజ్ఞులందు గౌరవింపఁ బడునె
రాత్రులందు మెరసి రాణించు చంద్రుడు
మిత్రుముందు వచ్చి మెరయ గలడె. 168

పరులకొఱకు నెన్నొ వరశాస్త్ర ధర్మముల్
నుడువుగాని తాను నడువలేడు
విలువబట్ట లెన్నొ తలఁబెట్టి యమ్మెడి
వానికున్నె తాల్చువారి తృప్తి. 169

అక్షర ధనమ్ము నొసఁగెడి యమరరూపి
యొజ్జ కేరీతి ప్రతిఫలమ్మొ సఁగఁ గలము
స్వాదుసుధలను వర్షించి సాకువేల్పు
గిడ్డికై యొక విలువయె గడ్డిమేఁత. 170

గురువు శిష్యజనుల కోపించి చెప్పినన్
మదికి హితము గూర్చు మాన్యుడెందు
ఉఱుము మెఱుము లడరు నురు నీలమేఘమ్ము
ధర సువృష్టి గురిసి తాపముడుపు. 171

చెడని విద్య నొసగి చెలగు సద్గురునకు
ధనము లెన్నియిడిన తృణసమంబె
చాల రుచుల నొసగు పాలిచ్చు గోవుకు
గడ్డి వేయు టేమిఘనత యగును. 172

బడి గుడియు నొక్కటని పరబ్రహ్మమైన
దేవుఁడే గురువని యాత్మ దెలిసికొలిచి
భక్తితో పత్ర సుమ ఫలార్పణము గాగ
తమిని జిహ్వాంతరంగ మూర్ధము లిడఁ దగు. 173

విద్యతోఁ గ్రమశిక్షణన్ వినయ గుణము
గురువరుని సన్నిధినె యొనగూడు నెందు
ఫలభర వినమ్ర తరుశీర్ష భవ్యగుణము
లొదవు ఋతు దోహద క్రియా విధుల తోనె. 174

బాల్యమనెడి మేల్మిబంగారు కాలమ్ము
చదువు నేర్పుటకె యొసంగఁ బడెను
పైడి నిత్తడి యని పారవేసెడి మూర్ఖుఁ
డట్టి వయసు వృథగ నెట్టువాఁడు 175

చదువు రాని వాని జన్మ రాణించదు
అమవస న్మెలంగు నట్టిరీతి
చదువుకొనిన వాని జన్మ ప్రకాశించు
పున్నమన్వెలుంగు పుడమిభాతి. 176

కన్నులున్న గ్రుడ్డి, కర్ణముల్గలిగియుఁ
జెవిటివాఁడు, నాక్క జెలఁగి మూగ,
మనుజుఁడయ్యు బశువు, మహి నవిద్వాంసుఁడు
బుద్ధిగల్గి మోట మొద్దుగాదె 177

చదువులేక యెంత చక్కని వాఁడైన
వసుధయందు కీర్తి వడయలేఁడు
తావిలేని వన్నెపూ వెట్టిదైనను
గాలి వ్యాప్తిఁ జెందఁజాల దెందు. 178

సదుపదేశ మెన్నిసార్లు వచించినన్
మారబోదు మూర్ఖమానసమ్ము
మిట్టనెన్నిసార్లు మేఘమ్ము గురిసినన్
నిలువలేదు చిన్నజలకణంబు. 179

కుల మదెట్టి దైన గోత్ర మెట్టిది యైన
విగత విత్త రూప విభవుఁడైన
వెలనొసంగు విద్య, శిల వికారంబయ్యు
వెలుఁగులీను రవ్వ విలువగొనదె. 180

నాల్కపైన వాణి నర్తించినంతనె
వ్యక్తి బ్రహ్మ యౌట వాస్తవంబు
వాఁడు నోరు విప్పి వచియించినది యెల్ల
ధరణి వేదమనుచుఁ దలను దాల్చు. 181

జవ్వనమ్ముతోడు సౌందర్యము బలమ్ము
నరుఁగు, మిగతధనము లస్థిరములు.
తనను వీడిపోని ధన మొక్క విద్యయే
దాని వలచి వచ్చు ధన ఘనతలు. 182

కళలతోనె వ్యక్తి తలఁ దాల్చఁబడు నెందు
కళలు తమమునార్చి వెలిగి యాడు
కన కళానిధులకె ఘన పీఠ మబ్బును
కళల నరుఁడు నేర్వవలయు నెందు. 183

చదువు నేర్చి వెల్గు చదువరికే కాక
వంశమునకుఁ బేరు వచ్చు గాదె
దీప మద్ది వెల్గు దీపించుటే కాక
ఇంటికెల్ల కాంతి నిచ్చుఁగాదె. 184

వయసులోన చిన్నవాఁడయ్యుఁ జదువరి
పెద్దలకును నెంతొ పెద్దయగును
కళలతోడ గూడు నెలబాలు శర్వుండు
బాలుడనక మౌళిపై ధరించె. 185

విద్య యుపకృతి ప్రస్తుతి విబుధులయెడ
ధేనువునకు గ్రాసమ్మిడు తీరులగును
కుటిలమతులకు నివి యొనగూడెనేని
పామునకుఁ బాలువోసిన పగిది యగును. 186

తల్లికంటె మించుతను రక్షకు లెవారు
భార్యకన్న సౌఖ్యప్రదు లెవారు
చింతకన్న మిన్న వంతఁ గూర్తు రెవారు
విద్దెకన్న చుట్టమెద్ది భువిని, 187

నీళులందు విరియు తైలబిందువు వలె
ప్రాజ్ఞునందు విద్య ప్రబలి వెల్గు
తైలమందు విడుచు జలబిందు వట్టుల
మూర్ఖునంటు విద్య మూలవడును. 188

శ్రమయొనర్చి చదువు సుమతి ప్రకాశించు
సౌఖ్యలాలసుండు శ్రమలనొందు
సూదిపోట్లు దినిన సుమములే తలకెక్కు
తక్కుపూలు ధూళిఁద్రొక్కఁబడును. 189

విద్యయొసఁగవలెను వినయంబు, చదువుండి
వ్యక్తి తాను గర్వయుక్తుఁడగునె ?
అలయ జీర్ణరోగి యన్నంబు భుజియింప
అమృతమయ్యు విషమె యగునుగాదె. 190

పూర్ణవిద్యయున్న పురుషుండు వినయియౌ
అల్పవిద్య గర్వమందఁజేయు
నిండుగుండ తొణక నేరదు వెలితితో
నున్న పాత్ర తొణకుచుండు గాదె. 191

జన్మమూర్ఖునకును శాస్త్రార్థబోధనల్
గలుపుటన్న వృథలుగాకయున్నె
పుట్టుగ్రుడ్డి ముందుఁ బట్టి చూపిన యద్ద
మద్ది వానిఁ దీర్చి దిద్దగలదె. 192

శశికళంక భాగసంత్యాగ మొనరించి
తక్కు నెలనె హరుఁడు తలఁ ధరించు
విజ్ఞ జనులు నొరుల విమల గుణంబులఁ
దడవి దుర్గుణముల విడుచు చంద్రు. 193

బుద్ధిబలము పెంచు సద్ధర్మము వచించు
ఘనత నొసఁగుఁ కీర్తిఁ గలుగఁజేయు
సూక్తినిచ్చు విద్య సుఖ భోగముల నిచ్చు
సకల ధనము లిచ్చి సత్కరించు. 194

అర్థహీనుఁడైన నందంబు లేకున్న
అంగబలము నంతె యంతె యైన
పదవి లేకయున్ననెది జాతియైనను
విద్య యొకటి యున్న విలువ దెచ్చు. 195

అన్య దేశ మేని యాత్మనివాసమేన్
బంధుజాలమేని పరులుగాని
పూర్వ పరిచయంబు బొత్తుగా లేకున్న
నధిక విద్య గలుగ నాదరింత్రు. 196

గురుని సూక్తు లెందుఁ బరిహరించు నొకండు
వినిన యటు నటించు వినునొకండు
స్వాతి చినుకు శిలల సమయు, నాకుల మౌక్తి
కాభమగును ముత్తెమగును శుక్తి. 197

పదమునంబుట్టు విద్య వాక్పతులు గొల్వ
రసగతిం బ్రవహించి సర్వజ్ఞు లెందు
తలను దాల్పగ నెందరో తపమొనర్చి
అవని సాధించి ధన్యాత్ములైన గంగ 198

వేరె నగలేల ? వాగ్భూష విద్య వినిన
కర్ణభూషణమగు, వల్లెగా నొనర్ప
కంఠభూషయౌ, ధారణగా నొనర్ప
నదిశిరోభూష, కృతివ్రాయహస్తభూష. 199

విబుధ సూక్తి శ్రవణ విధి విద్య హెచ్చును
తనకు దోచు జ్ఞానధనము మితము
పారు నీట గలియు బహు ఝరీ ఝరములు
బావి నూరు జలము పరిమితమ్ము. 200

కోటి చదువు లొక్కమాటలో జెప్పెద
పరుల పీడనమ్ము పాతకమ్ము
ఆల పరోపకార మత్యంత పుణ్యద
మ్మాత్మ తారకమ్ము నవనియందు. 201

అమృత మెచటనో సురాలయ మందున
కలదటంద్రు దాన కార్యమేమి ?
సద్గురూపదిష్ట సరస విజ్ఞానమే
అమృతమగును గాని యన్య మగునె ! 202

# సుజనమహిమ

పరుల కెగ్గొనార్చు పను లాచరింపడు
ఒరుల దుఃఖ మరసి యోర్వలేడు
ఆత్మవైరి కేని యపకృతిఁ దలఁపడు
స్వార్థమడఁచి నడచు సజ్జనుండు. 203

కలిమిగల్గి గర్వకలితుండు గాడెందు
లేదయయ్యు దైన్యబాధ పడడు
త్రికరణమ్ములందు నొక తీరుగా నుండు
సత్య వర్తనుండు సజ్జనుండు. 204

ధనవిలోభ మంది ధర్మమ్ము దప్పడు
అన్యసతులఁ దల్లులనుచుఁ దలఁచు
పరుల నాత్మవోలె భావించి సేవించు
సకల సుగుణరతుడు సజ్జనుండు. 205

జనుల మేలుకొఱకు తన కష్టముల నోర్చు
అలుకనైన దురుసు లాడకుండు
ఒకఁడు శత్రువనుచు నూహింపఁ డాత్మలో
సకల భూత సఖుఁడు సజ్జనుండు. 206

సాధుశీలుఁడేని సత్వహీనుండేని
సాదు రేఁగ నాగ జాలునెవఁడు ?
నూనమెరియకుండ తేనెగ్రోలెడి యీఁగ
తెట్టె కగ్గి వెట్టఁగుట్టి చంపు. 207

ప్రాణ మొసఁగి యైన మానము రక్షించు
వ్యసనములకు దూరవర్తి యగును
భోగ గతులకన్నఁ ద్యాగముం బ్రేమించు
సంఘసేవకుండు సజ్జనుండు. 208

పుట్టుకులము లెన్నొ పుడమి జనమ్ముల
వృత్తి నాశ్రయించి వెల్గుచుండు
పుట్టెతోడ నెందుఁ బుట్టిన కులములు
సుమతి కుమతి యంచు క్షోణి రెండె. 209

సహన గుణము మించఁ జాలు తపశ్శక్తి
దయను మించునట్టి ధర్మగుణము
తృప్తికంటె సుఖము తృష్ణకంటెను వ్యాధి
మేదినీ తలాన లేదు లేదు. 210

బ్రతికియుండి యేని మృతిజెంది యేనియు
సుకృతి తాపముడుపు క్షోణి ప్రజకు
చెట్టు నిలిచియేని కొట్టుంబడియు గాని
నిలువ నీడనిచ్చు నిలయమగును. 211

పై మెఱుంగు లెన్ని పచరించినను నేమి
యాత్మ సద్గుణంబు లమరకున్న
పాన పాత్ర నెంత పైకిఁ దోమిన నేమి?
లోన శుభ్రపరుచలేని యపుడు. 212

వినయ భూషణుండు మనుజుండు తలఁ దాల్చ
బడును, గర్వి కెందుఁ బరిభవంబె
వంగు వెదురు శిబిక వరలు రాజుల తలన్
నిక్కు వెదురు త్రొక్కు నిచ్చెన యగు. 213

తులువ లెంద రతని దూరుచుండిన నేమి?
సుమతి గౌరవమ్ము క్రమత నెదుఁగు
కాకు లెన్ని జేరి కారులు ప్రేలినన్
కోకిలకు ఘనతను గూర్చు జగతి. 214

ముదుకఁ డైన రిక్త మూర్ఖునికన్నను
మంచిబాలుఁడేని మాన్యుఁడెందు
చెఱకు వేముపగిది పెరుగకున్నను నేమి?
మధురచరులఁ బ్రజల మాన్యతఁ గను. 215

ఘనులు గంభీర బుద్ధి భావనలతోనె
యర్హులగుదు రున్నతపద మధిగమింప
మూలముల నెంతొ లోతుగా దోలుకొనిన
నంత యున్నతి నెదుఁగు వృక్షాళి యటులె. 216

మంచివాని చెలిమి మను నల్పుఁడేనియు
మించు కీర్తి ధర వహించి వెలుఁగు
పాలలోన గలియు బావి నీళ్లైనను
విలువజెందు క్షీరవిధము నొందు. 217

సజ్జనునకుఁ దోడు సజ్జనుండున్నచో
పసిఁడినంటి మణులు మసలినట్లు
దుర్జనునకుఁ దోడు దుర్జనుండున్నచో
కల్లు నల్లమందు గలిసినట్లు. 218

చెప్పకుండనె యరుదెంచు చెడుగుణములు
పట్టి బోధింప సుగుణముల్ పట్టుబడవు
మట్టి యంటును కుమ్మరి మనికిఁ జేర
పసిడి యంటునె కంసాలి వసతికేఁగ. 219

పరుల బాధలరసి కరఁగి పోయెడి గుండె
కరుణ స్నేహ మూర్తిగా వెలుంగు
కాలు వత్తి గాంచి కరగిన మైనమ్ము
నిండు కాంతి గ్గి నెమ్మి వెల్గు. 220

సుమతి యెప్పు డొరుల సుగుణాలఁ బేర్కొను
దుర్గుణమ్ము లెందుఁ ద్రోసిపుచ్చు
గట్టి విత్తనములు పొట్టలోనిడి తాలు
చెరిగి వేయునట్టి చేటవోలె. 221

మంచి వర్తనమును మించు బాంధవుడేది ?
తల్లి దండ్రి మించు దైవమేది ?
అతుల భాగ్యమేది ? యారోగ్యమునకన్న
సద్గురువుల మించు సఖులెవారు. 222

స్వర్గ మొకటి గలదె స్వాతంత్ర్యమును మించి
బడిని మించినట్టి గుడియుఁ గలదె
గుణ గణాల మించు మణిభూష లెయ్యవి?
సుజన మైత్రి మించు చుట్టమున్నె. 223

త్యాగ గుణము మించు భోగ సౌఖ్యమ్మేది?
నీచ సేవ మించు నిరయమేది?
సంఘసేవ మించు సత్కార్యమెయ్యది?
మధుర వాక్కు మించు మచ్చులేవి? 224

ఘనులు లేమివలన కారింప బడినను
నీచ వర్తనమున నెగడ రెందు
నీరసంబులయ్యు శారద మేఘమ్ము
లున్నతాధ్వములనె యొగిఁజరించు. 225

ప్రజకు సాయపడని పదవి భాగ్యము లేల?
మానవత్వ మిడని జ్ఞానమేల?
ఆత్మశుద్ధి లేని హరి పూజలవి యేల?
జాతి మేలుకొనని కైతలేల? 226

చవిని పెంపొనర్చు చక్కెర పక్వాన్న
వితతిఁ గలియు పిదప పీడిపోదు
సాధు వృత్తిఁ బెంచు చదువు సంస్కారమ్ము
తొంటబట్టు పిదప సుడిగి చనవు. 227

స్వార్థ రహితమైన జన్మ యరుచి యంచు
మితిని మించు స్వార్థగతి యుచితమె ?
ఉప్పు లేని వంట మెప్పు గాదనుచును
అతిగ నుప్పు వాడ నరుచిగాదె ? 228

మహితు లెప్పుడైన మర్యాద దాటమి
పుడమి జనులచేత పూజ్యులైరి
వేలదాట కెపుడు వెలయుటగదె యబ్ధి
నదులకెల్ల యాత్మనాధుఁడయ్యె. 229

వ్యష్టికై పాటుపడ బిందు వారి యగును
నే సమిష్టినంచు శ్రమింప నీరధియగు
అరయ స్వార్థమునకును పరార్థమునకు
అబ్ధికిని బిందువునకున్న యంతరమ్ము. 230

శత్రునింద ఘనుఁడు సరకు గొనంబోడు
సరకుగొనిన శత్రు శక్తి హెచ్చు
ఆట బొమ్మగాగ నాడించగాబూను
అరికి మౌనమొకటె యౌషధమ్ము. 231

## చెలిమి కలిమి

జన్మభూమి మించు స్వర్గమ్ము వేరెద్ది ?
తల్లి దండ్రి మించు దైవమెద్ది ?
ప్రేమకంటె వేరె పెన్నిధానంబెద్ది
ప్రాణ మిత్రు కన్న బంధు వెవఁడు ? 232

ధనికుఁడును దరిద్రుఁడనెడి భేదములేదు
నీది నాది యనెడి నియతి లేదు
వర్ణమత విభేద వార్త లడ్డమురావు
చెలిమి యొసఁగలేని కలిమిలేదు. 233

లాభ నష్టములను లక్షింపఁ బోదెందు
సుఖము దుఃఖ మనుచుఁ జూడదెందు
మనసు దాపకమ్ము మచ్చుకుండగ బోదు
మీరు మేమటన్న వేరు లేదు. 234

ఆత్మ నర్పించుఁ బ్రేమ రసాకృతి గొని
అద్వయాద్వైత గతితోడ నలరుచుండి
అక్షరమ్ము మాయాతీత మగుచు నొప్పు
చెలిమి పరమాత్మ రూపమై చెలఁగు గాదె. 235

రక్త సంబంధమే లేని రాగ గరిమ
అంగ సంబంధమే లేని యాప్త మహిమ
సొరిది నేకోదరులు కాని సోదరతయుఁ
దనరు చెలికాడె యాత్మ బాంధవుఁడుగాదె. 236

ఆజ్ఞ మీరకుండు నతఁడె సత్పుత్రుండు
సతత మానుకూల్యవతియె భార్య
ఆత్మ కష్ట సుఖములం దాదుకొను హిత
చింతకుండె తనదు స్నేహితుండు. 237

సంపదలఁ బరస్పరము నీర్ష్యలును లేవు
ఆపదలలో నుపేక్షాశయములు లేవు
ఒకరి నొక్కరు విడియెప్పుడుండలేరు
ద్వైత రూపకా ద్వైత తత్వమ్ము మైత్రి. 238

మిత్రుఁగనని పద్మంబయి మిడుకుఁ గన్ను
మిత్రుఁగనని బ్రహ్మాండమై మిడుకు మనసు
మిత్రుగనమి దుర్దినమయి మెలఁగు బ్రదుకు
వసుధ మిత్ర హీన గ్రామ వసతి తగదు. 239

పుట్టుమూర్ఖుఁ డెందుఁ బూజ్యుల సాంగత్య
మందు నుండ జడత యరుగఁ గలదె ?
మీనములకు జన్మతోనున్న చెడు కంపు
లెపుడు గంగ మునుఁగ నేఁగఁగలవె ? 240

కుజన కోటిఁ గూడి సుజనుఁ డొక్కఁడున్న
వారి వలెనె మార వలసి వచ్చు
బిందెనీట దుగ్ధబిందువు గలపిన
క్షీరరూప మరిగి నీరు గాదె ! 241

చెనటిమైత్రి పేయుఁ దన పని మందమే
వెలవెలంది ప్రేమ లోలికి నటులు
సుజనమైత్రి కష్ట సుఖములఁ దోడుండు
నాలు మగల ప్రేమ లలరినట్లు. 242

ధర్మగతిని జెరుచు దుర్మార్గ జనముల
నీడఁ బారకుండఁ జూడ వలయు
త్రాటిచెట్టు నీడ తగదనియే కదా
కొమ్మలైన బెట్టకుండె బ్రహ్మ. 243

మంచివారి చెలిమి పెంచు గౌరవమును
అల్పునకును గూడ నవని యందు
పూలఁ గూడినట్టి మాలతో దారమ్ము
తలను దాల్చు జనము ధాత్రి యందు. 244

చెడ్డవారి చెలిమి చెరుచు గౌరవమును
సజ్జనులకుఁగూడ జగతి నెందు
కల్లుకుండలోన గలియు గంగాంబువుల్
కల్లసేయు తమదు ఘనత నెల్ల. 245

వ్యక్తి నిష్ఠై చూడ వ్యక్తిత్వ మెట్టులు
తెలియఁగలదు చెలిమి సలుపకున్న;
ఉదకమందు లవణ మున్నది లేనిది
కనులఁ దెలియవశమె తినక యున్న. 246

చెడ్డవాఁడు చెడును చెలిమి చేసిన వానిఁ
జెరుపఁ జూచుచుండు మొఱకుఁ దగుచు;
కోఁతికిల్లులేదు కొంప లింకొకరికి
నుండ గూడ దనుచు నూడ బెఱుకు. 247

చెలిమి క్రొత్తగాను జేసిన మాత్రాన
వ్యక్తి గుణము దెలియ వలను పడదు;
తాన మాడిమేని తడినార్ప నొక క్రొత్త
వస్త్ర మూని తుడువఁ బదను గొనునె? 248

చెడు స్వభావమున్న చెనటికి నీతులు
చెప్పునపుడె కాని స్థిరము నిలవు;
నీళ్లు కాచు చున్న నిప్పున్న వరకె యా
క్షణమె నిల్చి యుడుకు చల్ల పడును. 249

తనకుఁదానె చెడెడి చెనఁటి మానవుఁ డెందు
వాని గూడినట్టి వారిఁ జెరుచు;
వైద్యుతాగ్ని నంటువాఁడు చచ్చుటె కాక
యతని నంటువారు హతు లగుదురు. 250

నెయ్యి రట్టులంత తియ్యగా మాటాడ
నాపదలకు నెల్ల రాదుకొనరు
తాలుధాన్య మొక్క పోలికగా నుండు
చెరిగి పోయు వేళ నెఱుక పడును 251

పెరుగుఁ గూడి పాలు పెరుగయై దృఢపడు
ఘనత నొందు నిటు సుజనులమైత్రి
నీరు గూడు తేనె నీరయై రూపఱు
ఖలుల మైత్రి విరిగి పలుచఁజేయు. 252

మంచివారి చెలిమి మహి నశించని కల్మి
పాలు నీరు గలియు పగిది నొప్పు
దుష్ట జనుల మైత్రి దుఃఖాల జనయిత్రి
తేనెలోన జీలుకు వాన చినుకు. 253

కుజన వర్తనంబు కుజనులకేకాక
వాని గూడు మిత్రవరులఁ జెరుచు
ఇల్లు కగ్ని దవులి నిరుగు పొరుగునున్న
కొంపలగ్ని నంటుకొనకయున్నె. 254

వెనుక తనను గూర్చి వివరించునదె కీర్తి
ముందె తప్పుఁ జెప్పు నింద హితము
చేటు మూడి నపుడు చేదోడగుచె మైత్రి
వార్ధకమున సాకువాడె కొడుకు. 255

అల్పమైత్రి యెంతొ యధికమేని సుకృతిఁ
దనరు విలువ నెంతొ తగ్గఁ జేయు
రాగి నైక్యమగుచు రాణించు కనకమ్ము
వన్నె తరిగి విలువ చిన్నదగును. 256

గొప్పవారి మైత్రి కొంచె మేన్ను జనుని
ఘనత హెచ్చి విలువ గాంచు నింక
మేలు రవ్వగూడి మెరయు పుత్తడి నగ
కళలఁ గూడి తనదు ఘనతఁ బెంచు. 257

మంచివాఁడు దుష్ట మనుజులతోఁ గూడి
యంతులేని కష్ట మనుభవించు
మంచ మెపుడు తాను మత్కుణమ్ములఁ గూడి
యెంత మాడి దెబ్బలెపుడు దినును. 258

సుఖమునందు చెలులు చుట్టాలు వచ్చిన
సుగపు సంతసమ్ము ద్విగుణితమగు
కష్టమందు మిత్ర గణము లాప్తులు రాగ
సంకటమ్ములెల్ల సగము పోవు. 259

తనను మించువారి దగు స్నేహమెందును
మెప్పు దెచ్చుఁ బుడమి నెప్పుడైన
పదము మించునట్టి పాదరక్షలఁ దాల్చ
బాలుఁ డెప్పుడైన గూలి పడును. 260

సములతోనె యొప్పు సఖ్యమైననుగాని
వియ్యమైన లేక కయ్యమైన
సరసగాత్రమునకు సమమైన శ్రుతివెల్గు
జంత్రములనె పాట శ్రావ్య మగును. 261

మంచివారి తోడ మైత్రి తా నెదుగును
శుక్ల పక్షమంటు సోముభాతి
చెడ్డవారి తోడఁ జెలిమి తా నేవేళ
బహుళ పక్ష చంద్రుభాతి నడగు. 262

చెప్పకుండనె యరుదెంచుఁ జెడు గుణములు
పట్టి బోధింప సుగుణముల్ పట్టుబడవు
మట్టి యంటును కుమ్మరి మనికిఁ జేర
పసిడి యంటునె కంసాలి వసతికేఁగ. 263

## అధికార మహిమ

బుద్ధికుశలుఁడైన పురుషుఁడే యధికార
సిద్ధిఁ గాంచఁగలఁ డుక్షితితలాన
అరయ దశ విధేంద్రియములకు పెత్తల
యగుచు బుద్ధి మేన నధివసించు. 264

ధర్మ దర్ప ధైర్య దార్ఢ్యంబు లాకృతి
గొనినవాఁడు త్యాగధనుఁడు ఘనుఁడు
జనహితాభిలాషి సమయోచితప్రజ్ఞఁ
దనరువాఁడె పదవిఁ దగినవాఁడు. 265

పదవి గౌరవంబు ప్రాప్తింపఁ జేయును
పదవి కొఱకు నరుఁడు ప్రాణమిచ్చు
పదవి పదము లంటి పరతెంచు సౌఖ్యముల్
పదవి కీర్తి నెంతొ ప్రబలఁ జేయు. 266

పదవి పలుకుబడిని బలము నెంతయుఁ బెంచు
పదవి యీయరానిదెదిగలాదు
పదవి కొఱకు ధనము ప్రవహింప జేయును
పదవిలేని బ్రతుకు విధవ బ్రతుకు. 267

పదవి లేని ధనము పదికోట్లు గల్గినన్
పదవి గాంచి వెరువ వలసివచ్చు
మణుగు పసిఁడికన్న మాస మెత్తధికార
మెక్కువంచు లోక మెదఁ దలంచు. 268

శాంతియుతుని ప్రభుని జనములు గొల్తురు
మండిపడెడి దొరలయందఁ జనరు
చల్లగా వెలుంగు శశిఁ గొల్చు తారకల్
తపన పెట్టు సూర్యుదరికి జనవు. 269

పదవిగల్గు వాని యెద నెందు స్వాతంత్ర్య
రమవసించి సౌఖ్యరాశిఁ దేల్చు
పదవిలేని వాని పదముల బంధించి
దాస్య భూత మెందుఁ దాపపెట్టు 270

అవని నస్వతంత్రు లష్ట దరిద్రులై
దాసులగుచు శునకత నవహింత్రు
బంతిలోన గాలి ప్రాణమ్ము వోయువా
డిచ్చు వచ్చు దశకు నీడ్చి తన్ను. 271

ఉచ్చ పదవి నెక్క హెచ్చగు శ్రమగల్గు
గద్దె దిగుట లనిన గడు సులభము
గుట్టపైకిఁ జేర కొండంత కష్టమౌ
దిగుట లెంతొ సులభ మగును గాదె 272

పదవి భాగ్య మప్పు ప్రఖ్యాతి గర్వంబు
వచ్చునపుడు ముదము నిచ్చు నెంతొ
ఏఁగునపుడు ప్రాణమేఁగిన యంతగా
సంకటంబు గూర్చు జగతి వివియె. 273

దొరలు నేతలంత, నిరు పేద యాస్తియొ
దోచఁబడును జాడ దొరుకకుండ
లింగ ధారులైన జంగాల వాడలో
కోడి మాయమయ్యెఁ గొంపదీసి. 274

పదవులందు స్వార్థపరులు ప్రవేశింప
ప్రజ యదెట్లు లాభపడును దాన
కన్నమేయు దొంగ కావలి కాఁడైన
ఇల్లు గుల్లజేసి యేఁగుఁ గాదె. 275

ప్రజకు సాయపడని పదవి భాగ్యమ్మేల
మానవత్వ మిడని జ్ఞానమేల ?
ఆత్మశుద్ధిలేని హరి పూజనము లేల ?
జాతిమేలుకొనని కైతలేల ? 276

అల్పు రాజ్యపదని నిల్పిన ఫలమేమి
మంచి చెడ్డ గనక నొంచఁ జూచు
కుక్కనందలమున గూర్చుండ బెట్టిన
దొరలు దొంగలనక కఱవబోవు. 277

అల్పునరున కేదొ యధికార మబ్బిన
విమల కీర్తినంది వెలుఁగ లేఁడు
గాలి కెగసి పుల్లె గగనాన నాడిన
నాత పత్రమగుచు నలరఁ గలదె. 278

ఆదరించనట్టి యధికారిఁ జేరకు
ప్రేమలేని స్త్రీని బెండ్లిఁ గొనకు
శ్రమల కాదుకొనని సఖులను గూడకు
పరిహరింపు మెదురు దిరుగు భటుని. 279

అల్పమతికి దొడ్డ యధికార మబ్బిన
కనులు నెత్తికెక్కి కాన దొరల
నెత్తిమీద కనులు నెగుడుటో తనకంటె
పైననుండు వాడె కానబడును. 280

ఓట్లవేళ నందరొలికింతు రమృతమ్ము
పదవి నెక్కి దొంగబయటఁ బడును
చూడ కత్తి సరకు చొక్కి మల్లే యుండు
అన్నమో విషమ్మొ తిన్నఁ దెలియు. 281

పదుగు రేకమగుచుఁ బదవి నిచ్చినయంత
మదము హెచ్చి వారి మరచు ఖలుఁడు
కుక్క నందలమున గూర్చుండ బెట్టినన్
మరువ దెపుడు తనను మనుచువారి. 282

పెక్కుజనుల రెక్క బొక్కలు విరుగమి
నెట్లు గూర్చు నొకఁడె కోట్ల ధనము
వేలనదుల జీవనాలను బీల్చక
జలధి యెట్లు రత్ననిలయుఁ డగును. 283

అడుగనంతసేపె యాదరమ్మిడుదొర
ఉడుగనంతసేపె యులుకు వయసు
పెట్టినంతసేపె ప్రేమించు లోకమ్ము
పదవియుండువరకె ప్రజయుఁ గొల్చు. 284

బీదజనుల త్యాగ భిక్షతోఁ దన్పెడి
ప్రభుని గాంచి పొగడుఁ బ్రజ యదెపుడు
ప్రోల్కి గుర్పఁ జేయు ముఖ్యుని ఋతురాజు
గాంచి కోకిలలు నుతించి పాడు. 285

జీవనము నొసంగి బ్రోవగాఁ జూచెడి
ప్రభువు నవని జనులు ప్రస్తుతింత్రు
జీవనము నొసంగు జీమూత చయమునె
యేకరీతి పొగడు భేకరాజి. 286

దొరయె పెద్దపనికి దొరకాని తనుగొల్చు
భృత్యజనుల నదుపు పెట్టఁ గలఁడె
తలయె చెడిన పిదప తక్కిన యంగాల
నాజ్ఞలోన నుంచ నర్హ మగునె. 287

తాను దొరయటంచు దాను అందరి నేలు
పట్ల ప్రభువు గర్వ భావమూను
దాస సేవ సేయు దాసాను దాసుఁడ
ననుచుఁ దలఁపఁ జాలఁ డంధుఁ డగుచు. 288

పదుగు రేకమగుచుఁ బదవి నిచ్చిన యంత
కుజనుఁ డెందు ధరణి గొప్పగాడు
ఖలులు మూర్ఖ జనులు కొలిచిన మాత్రాన
కల్లుకొట్టు దేవునిల్లు గాదు. 289

పదవి యందునున్న బంధువులరు దెంత్రు
పదవి యరుఁగఁ గబురు పంపరారు
విరులు తరుల నున్న వేళఁ దేంట్లరుదెంచు
నేలరాలు పూల జోలిజనవు. 290

చెడ్డ ప్రభువు మేలు చేయకున్ననుబోయె
హాని జేయకుండ మానఁడెందు
గ్రుడ్డికన్ను చూపుకొఱకు లేకున్నను
తీపు పెట్టి బాధఁదెచ్చుఁ గాదె. 291

ఎదుటి మేలు గోరదెంత పెద్దైతేమి
వాని పెద్ద తనము వ్యర్థమరయ
త్రాటి చెట్టు నున్నతం బెంతయిననేమి
నిలువ నొరుల కింత నీడనీదు. 292

ఇలను ఖలునిదలతు నెక్కించు కొనినంత
వెతలఁ బెట్టకుండ విడువగలఁడె
అల్పబుద్ధి పేను నౌదలఁ దాల్చిన
కుట్టి చంపకుండ నెట్టులుండు. 293

సంఘపథము లంటిచను ప్రభుం డెందును
గమ్యపథము శీఘ్రగతిని జేరు
ధారనంటి యేఁగు తరణి శీఘ్రమ్మేగు
ఎదురు నడచు పడవ కెందు శ్రమలె. 294

ఉన్నతంపు పదవి నొప్పిన మాత్రాన
కనులు తలన నుంచి, కాంచరాదు
క్రింది జూడకుండ ముందుకు నడచిన
పండ్లు రాలినేలఁ బడకయున్నె? 295

## త్యాగ మహిమ

ధరకు జీవనమ్ము దానమ్మొ నర్చెడి
వారికెందు ఘనతవచ్చు గాదె
కీర్తి కొఱకు మనుజుఁ డార్తిని జెందును
దాన రహితుఁ డెట్లు దాని బొందు. 296

త్యాగమొకటె ధర్మసార సర్వస్వము
త్యాగమవని మోక్షధామ మొసఁగు
త్యాగ గుణము వలచి తావచ్చుఁ గీర్తియు
నౌర! త్యాగిమించు వీరుఁ డెవడు? 297

త్యాగి విబుధులకును దా గౌరవార్హుండు
త్యాగి విశ్వమునకె తాను ప్రియుఁడు
త్యాగి వాక్కులనిన దలఁ దాల్చు లోకమ్ము
త్యాగి జనులకెందు దైవ సముఁడు. 298

దాతృ మూర్తి కీర్తి దర్పణశాలలో
నొకటి వేయిగాగఁ బ్రకటపడును
కీర్తి యద్ద మందు మూర్తి లోపించినన్
అతని బింబ కాంతు లతిగవెల్గు. 299

విత్తమేని మరియు విద్యా ధనం బేని
దాన భోగములకు దనర వలెను
ఉత్తముండు దాన మొనరించి యశమొందు
అధముఁడెందు భోగి యగుచుఁ జచ్చు. 300

పెరల కిడని తినని పిసినిగొట్టు ధనమ్ము
అవని జనులదెల్ల యగును గాదె
అవని జనులు కుడువ రతఁడును దిన
డట్టి విత్త రక్ష కతఁడు వెట్టికూలి. 301

లేనివాఁడు దాత దానమ్ము సేయలేఁ
డనెడి మాట కల్లయరసి చూడ
బ్రాటి చెట్టు కెందు తగు వ్యాప్తి లేకున్న
గుడిసెఁ గప్ప కమ్మలిడకయున్నె. 302

త్యాగి యైనవాడు ధనికుఁడు గాకున్న
నతని వలన లాభమగును ప్రజకు
చలమ వసతిలోన జలనిధి గాకున్న
జీవన మ్మొసంగుఁ జేరు ప్రజకు. 303

చలమ తాను నీరు జనముల కిడుచున్న
కొలఁది నూరుచుండు కొదువలేక
ఎవరు నీరు గొనక యెసఁగెడి చలమలో
నున్న నీరె యుండు నూరకుండు. 304

బొట్టి లరసి పెట్టు భోజనమ్ములకన్న
బీదవారికిచ్చు భిక్ష ఘనము
వక్రనదము లెందు వారిధి యిల్నింపు
ఘనము లెందు చెరువు కడుపునింపు. 305

తాను దినఁడు పరులఁ దాకగా నీయఁడు
వాని సంపదలవి వ్యర్థమరయ
చేల గడ్డితోడఁ జేసిన బొమ్మతా
నొరుల సస్యరక్ష నురక పేయు. 306

కూర్చు ధనములోభి కోటాను కోట్లను
తాను దినఁడు పెరలకైన నిడఁడు
గడ్డిగంపఁ బండి గర్ గురుమను కుక్క
తాను దినదు పశువు నాన నీదు. 307

వర్ష మిచ్చు నీరు వసుధ ద్రావినవెన్క
గాని కొలను గమికి దాన మిడదు
తన యవసరములకుఁ దగినంతఁ గైకొని
మిగులు నిధులు త్యాగి సుగతి కిడును 308

లేని వాని కెందు దాన మ్మొనర్చుట
మంచి దనుచుఁ దనను మరువరాదు
బట్ట విడిచి దాని పరులకై దానమ్మొ
నాచరింప మాన మరుగుగాదె. 309

ఘన యటంచు మ్రోగు గంటఁ బూజింతురె
ధన యటన్న భేరి డబ్బిడు దురె
కోర్కె లేక జనుల కోర్కి దీర్చెడి దైవ
ప్రతిమ కెందు పూలు పైన లిడరె. 310

దాన హీన భోగ ధన సంపదల వేల ?
జ్ఞాన రహితమైన జన్న మేల ?
గ్రాస మీయలేని కల్లరి కొలువేల ?
రోస మింతలేని మీస మేల ? 311

ధర్మమునకు నెందు దయయు సత్యంబులు
తల్లి దండ్రులగుచుఁ దనరుచుండు
త్యాగమనెడి గురువు దాపుఁజేరినయప్డె
ధర్మ దీప్తి పూర్ణతను ధరించు. 312

ఇచ్చువాని దవని నేవేళపై చేయి
కొనెడి చేయి యెందుఁదనకుఁ గ్రిందు
అందుకొఱకె యెప్పు డాత్మాభిమానితా
వాంఛితార్థ మొసఁగి వాసిఁ గాంచు. 313

దేహీ యనుచు నడుగు దేహీ బ్రదికియె చచ్చు
నిచ్చు దాత తాను జచ్చి బ్రదుకు
చావు దాత పేరు సమయింప గాలేదు
అతడు కాలజేత యగుట కతన. 314

పుట్టినప్పుడు నరుఁడు తాఁబుట్టలేదు
కీర్తి యుదయించినపుడె యామూర్తి పుట్టె
చచ్చినప్పుడు నరుఁడు తాఁజావలేదు
ఆత్మ కవమానము ఘటించినపుడె చచ్చు. 315

పారుబోతు లోభి జగాన బ్రదికి చచ్చు
వీరవరుఁడు త్యాగియె ప్రాణి వీడి బ్రదుకు
సస్య సంగతమయ్యును జచ్చు తాలు
గట్టిగింజ రాలియు మొలక యయి నిల్చు. 316

ఆశలేనివాఁడే గురు వనబరంగు
లోభరహితుండె శిష్యుడై ఋద్ధి జెందు
ఆశ లేనివానికి లొంగు నీశుఁడైన
విగత లోభుండు వైకుంఠ జగతిఁ గెల్చు. 317

చేనంటి నదులు దాన మొనరింపకున్నను
నోరులు బెట్టఁ జూచి యోర్వలేరు
పూలు పండ్లు నీయజాలని తుమ్మలు
పండ్ల చెట్ల చుట్టు ముండ్లగట్టు. 318

బిచ్చమెత్తికొనెడి సచ్చరిత్రునినైన
శుష్క తృణము కంటెఁ జులకఁ గాంత్రు
గడ్డిపోచ పశులకైన నన్నంబిడు
బిచ్చగాడు మాడి చచ్చుఁ దానె. 319

చేతిభూషణమ్ము సిరిమించు దానమ్ము
స్త్రీకి భూషణమ్ము శీలఘనత
చెవికి భూషణములు సీవియ సత్కీర్తులు
ముఖ విభూషణమ్ము పూర్ణవిద్య. 320

దానధార వెల్గఁ దగ దిగ్గజం బౌను
మాధుకర ప్రవృత్తి మక్షికమగు
అరసిచూడ దాతకలంతి భిక్షుకునకు
హస్తిమశక ఘనతరాంతరమ్ము. 321

బలము దానమిచ్చి పరమ వీరుండగు
చదువు దానమిచ్చి సద్గురువగు
ధనము దానమిచ్చి దాతయై యశమొందు
దాన గుణము మించు ధర్మమెద్ది? 322

సజ్జనాళి కెవ్వఁడు సల్పెడి దానమ్ము
కపిల గోవుకెందు గ్రాసమిడుట
ఇలను దుష్టజనుల కిడునట్టి దానమ్ము
భుజగమునకుఁ బాలు వోయుటగును. 323

## ఈర్ష్య

ఒరుల మేలుగాంచి యోర్వజాలక మండి
పడెడి వారి బాధ పలుక తరమె
మందు నెందు కట్టి మసియౌను దను దానె
కాన, యీర్ష్య తగదు మానవులకు. 324

ఇతరులకయి దానమీయకున్నను నాతఁ
డొరులకున్న జూచి యోర్వలేడు
పరమ లోభికన్న పాపి యీతండని
ఒరుల నోర్వనతని నోర్వదు ప్రజ. 325

తాను వెట్టకున్న దప్పులే దీతండు
ఒరులు బెట్టఁ జూచి యోర్వలేడు
అతని పేరు పలుక నలము పాపమటంచు
నుచ్చరించి పేరు, నుమియు జనము. 326

ఒకరిమేలుఁ జూచి యోర్వలేనితనమ్మె
యోర్వరానిబాధ యుల్లమునకు
క్షణమె బాధపెట్టి తన దారిఁ బోయెడి
వావు దానికన్న జాలి నయము. 327

ధనము పదవి విద్య తనకన్న నెక్కువ
యితర జనులకున్న నీర్ష్య హెచ్చు
రమయు నుమయు వాణి విమలయౌ యనసూయ
నొగి యసూయఁ గెల్వ నోపరైరి. 328

తనకు లేదటంచుఁ దగనేడ్చు నొక్కండు
ఉన్న దూడిపోవ నుడుకు నొకఁడు
ఒరుల కున్నదనుచు పరితాపపడు నొక్కఁ
డితని యీర్ష్య దుఃఖ మెటులఁబాయు. 329

తనకు లేమికేడ్వఁ దగవు పుట్టదుగాని
ఒకని కలిమి కేడ్వ నుచితమగునె
కలుగు వాని మించఁ గల శ్రమన్ జేయగా
లేనివాఁడె యీర్ష్యఁ బూనువాఁడు. 330

ఆజ్యమంటు నగ్నియై కనుల్ మండు నీ
ర్ష్యాళు వొరుల పెంపు నరసినంత
ప్రబలు నీర్ష్య తాను భస్మాసురుని హస్త
మగుచుఁ గాల్చుఁ దనదు నాత్మనెందు. 331

ఒకఁడు చెడిన తనకు నొరుగు లాభమ్మేమి ?
పరుఁడు పెరుగ దరుగు భాగ్యమేమి ?
ఈర్ష్య గల్గువాని కెల్లరుం గారణ
రహిత శత్రులనుట విహిత మగును. 332

పుట్టఁ బోవ దీర్ష్య పురుషార్థి కేవేళ
నపురుషార్థి యందె యది జనించు
పెరుగు స్పర్థగల్గు పురుషార్థి ప్రతికక్షి
అపురుషార్థి యీర్ష్య నందె యేడ్చు. 333

ఎంత గొప్పవానినేని లోకమ్ము దా
మనికిగల్గు వరకు మత్సరించు
చచ్చిపోవు వెన్క సన్మాన మొనరించు
స్తుతులు గౌరవములు మృతునకేల ? 334

పరుల దోషములనె పరికించి యీర్ష్యాళు
వపహసించి మురియు నాత్మలోన
ఆవుపాల పొదుఁగు నారసి కాకులు
పిణుదులేరి తినుచుఁ దనియుచుండు. 335

మత్సరమ్ముకన్న మదిఁ గాల్చు నిప్పేది ?
మహి నకీర్తికంటె మరణమేది ?
అమిత గర్వికన్న నంధుఁ డెవ్వఁడు పూర్ణ
స్వార్థపరతకంటె శత్రువెవఁడు ? 336

మొగముముందు జేరి మొగులంట పొగడుచు
చాటుకేఁగి వట్టి చవట యనును.
అరయ ముందు బొగడు నవకాశవాది తాన్
కల్లవలపు చూపు గణిక గాదె. 337

జగతి దోషజ్ఞులైన యీర్ష్యాళులౌర
కావ్య సుధలనుగ్రోలియుఁ గవిసుధాంశు
నమల కీర్తిచంద్రికల దోషాప్తిఁ బలిమి
మరుగు పరుచఁ జూచెదు రాహు సరణి నుండ్రు. 338

భవ్యకావ్యము గుర్తింపఁబడక యుంట
జ్ఞానహీనుల రసికతలేనితనమొ
సాటి పండిత కవుల యీర్ష్యా గుణమ్మొ
ఐన నిళియంబుదము లర్కు నణచలేవు. 3:9

సంపదన్వితు నొరుని సహింపలేక
చెరుపఁ దలచుటల్ తను దానె చెరుచుకొనుట
పాలతోఁ గూడు నీరము న్నాప నెంచి
పొంగు దెప్పించు నగ్నియె పొలియదాకన్. 340

అనుజుఁ గొట్టి చంపి యాస్తి గైకొను నేత
జాతి యైక్యతలను జాటుచుండు
కూటిలోని రాయి బైటవేయని వాఁడు
ఏటిలోని రాయి నెత్తఁ గలఁడె. 341

కుమతు లొరులయందు గుణమున్న నీర్ష్యతో
నెపుడు దోషములనె యెన్నుచుండ్రు
గట్టి విత్తనముల నెట్టి క్రిందొనరించి
పొల్లు నెత్తి చూపు జల్లెడవలె. 342

ఒరుల ప్రగతి గాంచి యోర్వగా లేనట్టి
వారిఁ బ్రతిఘటింప వైరమెదుఁగు
బురదలోన శిల విసరివేసి నంతనె
మొగముపైన జిల్లు మురుగురొంపి. 343

## మోసము

నరుల నొక్కసారె నమ్మించు మోసమ్ము
మరల నమ్మఁ జేయఁ దరముగాదు
కుండ బిగుల నూదె రెండు పైసలెకాని
తెలిసివచ్చె కుక్కతులువ గుణము 344

వలపు ప్రేమగాదు, వారాంగ నామణి
భార్యగాదు, వాపు బలుపు గాదు,
మంచు వానగాదు, మాటల మానవుల్
కార్య కారు లెపుడు కారు కారు. 345

పైకిజూపు రిక్త భక్తి ప్రపత్తులు
నవి పరీక్షసేయ నాగలేవు
పైడిపూఁత నొప్పు బంగారు కడియము
తరచి యొరను దీయ దాఁగ డెందు. 346

మనిషి తియ్యగాను మాటాడినంతనె
ఆత్మబంధు వనుచు ననగరాదు
ముషిణి పండు మధురముగ నున్నదని దాని
దినిన బ్రాణములను దీయకున్నె. 347

పాడి పంట పసులు పలుతీర్లు పెరుగును
మనుజ సంఘములను మనుచుటకయి
మానవుండు పెరుగు మంచిగాఁ దిని త్రాగి
మోసమొలయ జనుల ముంచనెంచి. 348

ప్రజల కన్నుగట్టి నిజమును నీళ్లలో
పాతిపెట్టి యారసాతలమున
మాటలాడువారి నోట బెల్లముగొట్టి
సార్వభౌముఁడయ్యె స్వార్థపరత. 349

మోసపుం గుయుక్తి మును పుట్టెఁ బుట్టుటో
ఇది యదృష్టమంచు నుదురునంటు
ఒగి యదృష్టమనిన నొరు లెఱుంగని గతి
మోసపరచి కొంపముంచు టగుట 350

రాళ్లు బియ్యమగును, నీళ్లు పాలై తీరు
కట్టుపొట్టు పసుపు కార మగును,
కూరలో మసాలతీరు మారును లద్ది
తెలియ వశమె మోసముల మహిమలు. 351

తిమ్మి బమ్మి యగును తీపుబంగారము
చొక్కమట్లు మెఱుపు గ్రక్కుచుండు
మోసగాని మహిమములఁ దెల్యవశమౌనె
యజునకైన వాని యబ్బకైన 352

స్వార్థమను నృపునకు సైన్యాలు కల్లలు
మోసమనిన నతని ముఖ్యమంత్రి
పరులఁ దోచి లక్షపతి యౌనె యాతని
ధర్మశాస్త్ర లక్ష్య మర్మమెల్ల. 353

కల్లలాడు, నమ్మగా యోగ్యుఁడనజెల్లు
దోచుకొనును, ప్రజలదొర యనఁబడు
మోస మెపుడు ధనపు టాసతో రమియించి
దోసముల సృజించు దొడ్డబ్రహ్మ. 354

కష్టపడక లెస్స కడుపు నింపెడివాఁడు
లంచమిగ్గి కండ బెంచువాఁడు
అక్రమంపు లాభ మార్జించు వారెల్ల
దొరలపేరి పగటి దొంగ లౌర! 355

పైకిఁ జూడ నీతిభాషలెన్నియొ పల్కి-
స్వార్థములను దాచ శక్య మగునె
కప్పు రంపు విడెము మెప్పుగా నమలిన
త్రాగు సార కంపు దాచతరమె. 356

తండులమ్ములందు స్థాపించె లింగాల
బూదిసిమిటు తోడ పూజచేసె
అతని భక్తిమెచ్చి హరుఁడిచ్చె నైశ్వర్య
మేమి చెప్పవలయు నీశుకరుణ. 357

దేశ మనగ నాదుదేహమ్మె యనుకొను
దేశమనిన నాకు దేవుఁడనును
దేవు వైపు జూపి దేహమున్మేపును
ఆర్య సంప్రదాయ మదియె యంచు. 358

స్వస్వరూప వస్తుసాయుజ్యమును గాంచె
వంటనూనె మరియు వైద్యు తేనె
చిత్తమలరవాని సేవించు వారగు
భక్త కోటికెందు ముక్తికొదువె. 359

నల్లివోలె నెపుడు నక్కియుండు ఖలుండు
పిల్లివోలె కార్య విఘ్నములిడు
బల్లి శకునములను బల్కును నూసర
వెల్లివోలె రంగులెపుడు మార్చు. 360

సంపదన్వితు నొరుని సహింపలేక
చెరుపఁదలచుట తనుదానె చెరుపుకొనుట
పాలతోఁ గూడు నీరమున్పాపనెంచి
పొంగు దెప్పించునగ్నియే పొలియదొక్కొ. 361

అరయ వంచకుల్ తమకొక యవసరమ్ము
కలిగియున్నంతవరకె పో చెలిమికాండ్రు
అవసరముదీర నవల వాడెవఁడో యేమొ
కేలుఁగాలఁ బట్టిన యాకులేల పిదప! 362

పరుల బాధపెట్టు వంచకుల్ ముగ్గురె
అవని జార చోర హంతకులని
మానమొకఁడు దోచు మరొకఁ డర్థముదోచు
ఇంక నొకఁడు ప్రాణ మిట్టె తీయు. 363

## దుర్జన పరిచయము

కాపురుషుఁడు లోకకంటకుఁడై యొప్పి
ఎప్పుడొరుల కీడు నెదఁ దలంచు
ఒకరి నవ్వువెల్గు నోర్వజాలని గూబ
పరులకంటి నీటఁ బెరుగు మొసలి. 364

ఉండవలెనన్న సుకృతియొ యుర్విపీడు
వలదటన్నను పాపి యివ్వసుధ బ్రదుకు
తావినిడు పూలు క్షణముండి ధరణిరాలు
బాధ నిడుముల్లు స్థిరగతిఁ బ్రబలియుండు. 365

పాముపైన జేరి పవ్వళింపగవచ్చు
మించు విషమునైన మ్రింగవచ్చు
హరుఁడు నజుఁడు వాని యబ్బయైనను గాని
ఖలుని సహవసతిని నిలువలేడు. 366

పెద్దవారి సాటి చెప్పుచు తన తప్పు
లొప్పులనిన జనుల మెప్పుగనునె
మైలబట్ట రొచ్చు నీట లందుదికినఁ
దెల్ల వస్త్రమగుచుఁ దేజరిలునె. 367

ముండ్ల కంపలోన ముద్దైన పుష్పాలు
కమ్మనైన పండ్లు గాంచవచ్చు
లోకకంటకుఁడగు లోభి గుండెల దయా
సత్యములను గాంచ సాధ్యపడునె. 368

నరుఁడు పులినిఁజంప ధర శూరుఁ డందురు
నరుని బులి వధింప దురితమండ్రు
దుష్ట వధము ప్రజయె దొడ్డగాఁ గీర్తించు
సాధు పీడనంబు సది నొనర్చు. 369

ధరణి దుర్జనుండు నరరూప మెత్తిన
త్రాఁచు పామటంచుఁ దలపవలయు
నడక వక్ర గతుల నాల్కలు రెండుండి
విషవదనముగల్గి వెలయుచుంట. 370

ఎపుడు కుజనసంఖ్య హెచ్చుగా నుండును
మంచివారి సంఖ్య కొంచె మవని
పూలకంటె నెపుడు ముండ్ల సంఖ్యయె హెచ్చు
రత్నరాశికన్న రాళ్లె హెచ్చు. 371

విషము కోరలందె వెలయుట ఫణికెందు
కోరలూడఁ బెఱుకఁ దీరు భయము
కుమతి కెందు విషము గుండెలో నుండుట
తీయరాదు భయము తీరిపోదు 372

పెద్దవారు నాకు స్నేహితులని చెప్ప
పాపి జనులు నాకు బంధువులన
దురద సుఖమటంచు నెరనమ్మి యుండుట
వ్రణము పైన మమతగొని వనరుట 373

పరమ దుష్టుతోడఁ బగ యొనర్చినగిడె
చెలిమి సేయనేని చేటు మూడు
అగ్ని నంటునెడల నరచేయి గాల్చును
బొగ్గునంట మైల బొందుగాదె 374

బంధువైననేమి ఫలము ? దుర్జనుఁడు తా
నటులె సుజనుఁడితరుఁడైన నేమి ?
అల విభీషణునకు నన్న తమ్ములనిచ్చె
రాముఁ డితరుఁ డయ్యు రాజ్యమిచ్చె. 375

కుజన వర్తనంబు కుజనునకే కాక
వాని బంధు మిత్ర వరుల నొంచు
ఇనుముగూడు నగ్ని కేవేళ సమ్మెట
పెట్టు కొట్లు తప్ప వెట్టులైన. 376

తనకుఁదానె చెడడు చెనఁటిమానవుఁ డెందు
వాని గూడు మానవాళిఁ జెరచు
వైద్యుతాగ్ని నంటువాఁడు చచ్చుటె కాక
అతని నంటు వారు హతు లగుదురు. 377

తుచ్ఛగుణున కెందు వచ్చిన కోపంబు
వేడికోలుతోడ విస్తరించు
కణ్ణినంటు నిప్పు ఘనముగా మండును
విసనకఱ్ఱతోడ విసరినంత. 378

ఒరుల సుఖము దుఃఖ మరసి నాదనుకొను
మనుజుఁ డవని దేవుఁ డనగబడును
తనదు కష్ట సుఖములనె ప్రజల్ తమవని
తలపవలయు నను దానవుండు. 379

సత్వగుణునకెందుఁ జనుదెంచు కోపమ్ము
ప్రార్థనమ్మెనర్పఁ బాసిపోవు
నీటనున్న వేడి నిర్వృతింగనుదాను
విసన కఱ్ఱతోడ విసరినంత. 380

వృథలు ఖలులకెందు విద్యా ప్రబోధముల్
చెడుఁ గృతఘ్నునకును జేయుమేలు
రిత్త చవిటినేల విత్తనంబుల నాటు
వ్యర్థమెందు పిసిని యర్థమెల్ల. 381

తనదె సత్యమంచుఁ దలలేని మూర్ఖుఁడు
పట్టు విడువఁ డెందపాయమొందు
తలెయె లేని యెంౘ్రిడి తన రంధ్రమున నక్క-
వాల మిడినబట్టి వలను బడదె. 382

# మూఢజనుఁడు

విజ్ఞ జనులయట్లు లజ్జలఁ గూడను
సమత నాదరించు జడుఁడు తాను
మధుర గుడముపైన మలిన వ్రణముపైన
ఎంతొ ప్రీతి వ్రాలు నీఁగవోలె.
383

తెలివి మాలువాఁడొ ధీమంతుఁడొ నరుండు
మంచి పెద్దవాని మాట జెప్పు
ఘటము పగిలినదియొ గట్టిగానున్నదొ
కొట్టి చూడ నాదు బట్టి తెలియు.
384

బయట నింట సాయపడలేని వ్యర్థుండు
మేక మెడ స్తనమ్ము గాకయున్నె
చీర మాంస మీదు గీఱిన పాలీదు
పనికిరాకయుండుఁ దనకుఁ గూడ.
385

కుమతి సుమతి నరయకుండ మేలొనరింప
దాన నేమి ఫలము దక్కఁగలదు ?
పైరుతోడఁ దుంగఁ జేరిచి పెంచిన
కలుపు మొక్కలేమి ఫలమొసంగు ?
386

సాధువనుచుఁ బూజ సల్పిన మూర్ఖుండు
మనసులోని స్వార్థమణచలేడు
పుట్టమీద నెంత పూజచేసిన నేమి ?
పానకమ్ముగాదు పాము విషము.
387

చక్కదనము గాంచి సానిని వలచును
భార్యపీడి ధరణి బాలిశుండు
పరమ రుచికరంబు పాయసం బని కుష్ఠ
రోగియెంగిలేని గ్రోలనగునె. 388

పాపమునకు లేవు భయ నయమ్ములు నట్లె
కోపమునకు లేదు కొంకు జంకు
ధూమమునకు లేదు తోవయు తావును
కామమునకు లేవు కనులు చెవులు. 389

అకట సద్గురువుల, నవమతి సల్పెడి
వారి గతులఁ జెప్పవలెనె వేరె ?
అమ్మపాలు ద్రావి రొమ్మును గ్రుద్దెడి
బాలిశుండు తాను మేలుగనునె. 390

తెలివిలేని వాని కెలిమి జేసిన మేలు
లెక్కలోకిరాదు లేశమైన
నెరసినట్టి తలకు విరులెన్ని దురిమిన
నెంత నూనె పులుమ నేమి ఫలము ? 391

## ఋ ణ ము

అప్పు గాకయుండు నంతకె వెచ్చించు,
కప్పు గల్గు వరకె కాలుసాచు,
బలముగల్గినంతె బరువుల మోయుము,
జారిపడిన లేపు వారు లేరు. 392

అప్పుదెచ్చునప్పు డానందపడు దానిఁ
దీర్చుమనిన గలదు తిప్పలెల్ల
అప్పులాను వేళ నానందపడు మబ్బు
కురియుమన్న వేళ నుఱిమిపడును. 393

ప్రాణికోటులెల్ల పసి పిల్లలనుగని
యొకటి పదిగఁ బెరుగుటొప్పుఁ గాని
పిసినిసెట్టివద్ద పిల్లలఁ బెట్టెరా
ప్రాణిగాని యప్పు పైసలెల్ల. 394

పదిగ నప్పు లడుగఁ బరపతియే చచ్చె
నిందపడిన యప్పు బొంది చచ్చె
ఆడపిల్లఁ బుట్ట నభిమానమే చచ్చె
యాచనకును ముందె యాత్మ చచ్చె. 395

కాంచ బీదవాని కష్టసుఖమ్ములు
అప్పువాని కరుణ కర్షమగునె
ఎత్తుబడిన బక్కయెద్దు పుండది కాకి
కేమి ముద్దు కండలిగ్గితినఁగ. 396

అప్పు లెక్కువౌను నాడంబరాలతో
అప్పులకును వడ్డి యధికమగును
వడ్డి యసలు వచ్చి వడిఁ గొంప మ్రింగును
అవని మానవులకె యప్పు ముప్పు. 397

అప్పుచేసి భోగ మనుభవించుట లొల్ల
అరువు సొమ్ము బెట్టి మురియుటలును
పెరల యింటిపైనఁ బెత్తనమ్మూనుటల్
కడకు నివియె దుఃఖ కారు లగును 398

మగువజాతి కొక్క మగఁడుండు మగవాఁడు
అతని మగఁడొకండె యప్పువాడు
ఆశ గల్గువాని కందరు మగలెరా
ఆశ వీడువాఁడె యగుఁ బురుషుఁడు. 399

## ధీర పరిచయము

పారుబోతు తా నేవేళ బ్రదికి చచ్చు
వీర వరుఁడెందు ప్రాణమ్ము వీడి బ్రదుకు
సస్యసంగత మయ్యును జచ్చుఁ దాఁలు
గట్టిగింజ రాలియు మొలక యయి నిలుచు. 400

మాతృదేశ స్వతంత్రతా మాన్యరక్షఁ
గావలె నటన్న శిరమిడఁ గలఁడుగాని
శత్రువునకు భయంకర సమరమందు
వీపు నొసఁగఁడు నిజమైన వీరుఁ డెందు. 401

వైరిచే వ్రేటుఁ బడిన యవ్వీరు కరము
కాష్ఠతాడిత భుజగమ్ము కరణి వారి
కాయముల నసిదంష్ట్రిల గాయపరచి
ప్రాణవాయువు భుజియించి పగనడంచు. 402

అసి నాగులు వీరులకేఁ
గసి బిసి పెనగాడు కొనుచుఁ గాటిడు తఱికై
బుసకొట్టి పొంచు నాజిని
హసియించన మృత్యు దంష్ట్రలసి రూపములై. 403

ధీరయోధులకై సుధాధార యాజిఁ
దలఁకు పిరికి బంట్లకు విషధార నిరత
ధర్మరత వసుంధరకు నాధార వీర
కంఠముక్త రక్త విహార ఖడ్గధార. 404

ఘనుఁడగు వీరుం డెందును
మను నిడుకొను యశము ప్రాణముల బలి నిడియున్
శుని తెఱఁగున సింగంబది
వెనుదిరుగుచుఁ దోఁక ముడిచి వెడలునె యనిలో. 405

తెగ రేగి పగల నొందొరు
బిగి కౌఁగిటఁ బెనగు చోకట విరిసెడి ధూళిన్
బొగ నెగసెడి కీలల గతి
నగపడి యగపడక యాజి నాడరె వీరుల్. 406

వైరి జనుల కంటగ రాని వైద్యుతాగ్ని
దుర్నిరీక్ష్య భాస్కరుఁ దరి దురము నందు
స్థిరయశ స్సౌధగత రత్న దీపకళిక
వీరు, విలయ రుద్రుండని వెఱచు యముడు, 407

వాసవుని వజ్రమున కున్న వాడి వోలె
అగ్ని నుదయించు సంతాపకార్చివోలె
సతికి సహజమౌ శీలమ్ము సరణి ధరణి
వీరుతోఁ బ్రతాపముబుట్టి వెల్గుదాను. 408

మొక్కలింపు వీరుఁ డొక్కఁడున్నం జాలు
తక్కు సైన్యమునకు ధైర్య మొదవు.
వీరమౌళి యొక్క విజయుడుండినగా దె
పాండు సుతుల కెంతో బలము హెచ్చె. 409

భయద జలధి రత్నచయమున్నగౌను చంద్రు
ముండ్ల కంపనున్న పండ్లగౌంద్రు
సకల కష్టములను సహియించి యేనియు
సుఖము అనుభవింత్రు శూరవరులు. 410

## సు రా పా న ము

ఉచిత వర్తనంబు నుల్లంఘన మొనర్చి
కల్లు త్రాగువాఁడు నెల్లిద మగు
పైస లిచ్చి తనదు పరువు గోల్పోయెను
ఇంతకన్న హీనమేమి గలదు ? 411

ఇల్లుగుల్ల సేయు కల్లును సేవించి
దారిలోన దెలివి తప్పి పడును
ఉసురులుండగానె ముసురు నీఁగలు నోట
చచ్చి పడిన వాని శవమున కటు 412

పాలు పెరుగు గొనరు ప్రతియింట జని యమ్మ
కొట్టుకేఁగి కల్లు పొట్ట నింపు
మంచి చెప్ప నాలకించరు జనములు
చెడును నేర్పువారికడ జనెదరు. 413

గుట్టుమాట చాడిగొట్టు దాచఁగ లేడు
త్యాగశీలి ధనము దాచలేడు
కాముకుండు వలపు కాంక్ష దాచగలేడు
త్రాగుబోతు నిజము దాచలేడు. 414

కల్లు త్రావు వాని కిల్లేల పట్టేల?
వారసతికి వావి వరుస లేల?
ప్రణయ కాముకులకుఁ బవలేల? రాత్రేల?
తస్కరునకు దయయు ధర్మమేల? 415

కొంచు వంపు నెత్తుగా నెత్తు వంపుగా
వదక వచ్చిగూడఁ బడును లేచు
ఇంటి వారినైన నెవరు మీరని యడ్గు
త్రాగుబోతు భ్రమలలో మునింగి. 416

కల్లు సల్లమందు గంజాయి మత్తతల్
విందుప్రేమ పూర్ణ విధుని రూపు
పూట నొంపు లొక్క పూటకే శోభించు
తెల్లవార మొగము వెల్లఁబారు. 417

సురసమాఖ్యతో నసుర కృత్యములిడి, పే
ర్వించు వారిఁ జెరచు నెంచ మదిర
ప్రాణమాన విత్త భంగమ్ము నొనరించి
గాని వదల దెందుఁ గల్లుతాను. 418

స్వాదు రూపాన మానస సదన మంటి
ప్రమద డోలలఁ దేల్చుచు భ్రమల ముంచి
కలుగు సర్వస్వమును వెలిఁగ్రక్కఁ జేయు
మధుఘటమ్ము వేశ్యయుఁ బట్టి మరి విడువవు. 419

పాము వోలె కానబడుఁ దాళవృక్షమ్ము
గరళమట్లు కల్లు కనుబుసొడు
తియ్యగా మెలంగి తీయును ప్రాణాలు
కల్లు తాను మోసకారివోలె. 420

త్రాగుబోతు పరుల ధనముల హరియించు
తల్లి తోడు ననక తరుణి నిగ్గు
కాకివోలె వదరు కనిబూని తలఁద్రెంచు
కల్లు పాప వితతి కిల్లుగాదె, 421

కనులు వాలిపోవ తనువెందు సోలును,
సరిగ నోట నాల్క తిరుగకుండు,
బట్ట యూడి దారిఁ బడిపోవు శవమట్లు
త్రాగుబోతు చులకదనము బొందు. 422

త్రాసుబోతు తాను దాచ యత్నించిన
పట్టి యిచ్చు కల్లు పరిమళమ్ము
దొంగతన మొనర్చి దొరకరాదనుకొని
జనుల కనులఁ గట్టి శక్యమగునె. 223

## సంకీర్ణములు

చక్కదనముగాంచి సానిని వలచును
భార్యవీడి ధరణి బాలిశుండు
పరమ రుచికరంబు పాయసంబని కుష్ఠ
రోగి యెంగిలైన గ్రోల నగునె. 424

జగతిఁ దనదు భార్య సావిత్రి గావలె
సత్యవంతుఁ డనగ జనఁడు తాను
స్వర్ణమునకు రత్నసంగతి తగుగాని
లోహములకు మణుల పోహళింపె. 425

ప్రేమలేని యట్టి భామిని మెడలోన
తాళిగట్టినంత నాలు గాదు
లొంగదీసి బలిమి లింగమ్ము మెడగట్టి
భక్తురాలటన్న ముక్తిగనునె. 426

ప్రాణ రక్షకౌఱకుఁ బారవచ్చియునైన
దుష్టగృహములోన దూరజనదు
త్రాటిచెట్టుక్రింద త్రాగిన పాలేని
జనము మదిరయంచు సంశయించు. 427

ఎపుడు మరచియైన నెడను నాకర్షించు
చెడ్డ వ్యసనములను జేరఁ జనకు
తెలిసి యంటనేని తెలియక యంటనే
నగ్ని కాల్చకుండ నలరఁ గలదె. 428

వినుమొరులఁ బ్రేమఁ జూచిన
దను దాఁబ్రేమించుకొనుచెు తా నొరు ద్వేషిం
చిన ద్వేషితనకు తానే
తన మోమునె చూపు విశ్వ దర్పణ మెందున్. 429

పరుని నిందసేయు పరమేశుఁడైనను
ఆత్మనుతి యొనర్చు హరియు జడుడె
నిందు బొక్కెన యది నిక్కుచుఁ బైకేఁగు
రిత్త యగుచు నీట మొత్తఁ బడును. 430

అకట సద్గురువుల నవమతి సల్పెడి
వారి గతుల జెప్పవలెనె వేరె
అమ్మపాలు ద్రావి రొమ్మును గ్రుద్దెడి
బాలకుండు తాను మేలుగనునె. 431

అల, యజీర్ణ రోగి కన్నపానములేల ?
ముద్దు లొలుకు తరుణి ముసలికేల ?
జరయు మృతియులేని స్వర్లోక వాసులౌ
దేవతలకు కామధేను వేల ? 432

తనువు, భాష, జాతి తన రక్తసంబంధ
మొక్కటైన ప్రేమ ముట్టిపడునె
మనసు లొక్కటైన మనుజులు పెరవార
లైన నేమి? ప్రేమ తా నెదుగును. 433

లోభగుణముతోనె యీ భవబంధాల
జిక్కి స్రుక్కి నరుఁడు చింతపడును
కోతి బియ్యమునకు కొబ్బరి కాయలో
చేయి దూర్చి విడక చిక్కినట్లు. 434

పదుగురేది నడువ నది చెడ్డ యయ్యును
అదియె లోకరూఢి యగును గాదె,
పైన బూది సేయు పాడు వాసన చుట్ట
పలువురాన దాని విలువ హెచ్చు. 435

తాను మెచ్చుఁ దినగఁ దగు నెందు మనుజుండు
పరులు మెచ్చ నడువఁ బాడి యగును
పరులకొఱకె తాను బట్ట గట్టగవలె
పాడికొఱకె కట్టువడగ వలెను. 436

పని నొనర్చువాఁడు తనవారివలె, లేడు
పరులవోలె తినెడివాఁడు లేడు
వైరి యట్లు తప్పు లేరువాడును లేడు
జనని వోలె సైచు జనులు లేరు. 437

తన యదృష్ట మింతకును బాగులేకున్న
పరుల నింద సేయ పాడియగునె
తన మొగాన జక్కదనము లేకున్నప్పు
డేల దర్పణమ్ము నేలగొట్ట ? 438

ఎదుటివాని శక్తి యెంతగా నున్నదో
తెలిసికొనక హెచ్చు పలుకఁబోకు
నీటిలోతు గనక యేటిలోఁ జొచ్చిన
మొదలె మోసమొదవి మునిగిపోవె. 439

అందగత్తె తాను నలుకఁ జెందిన ముద్దె
బుడుత తప్పటడుగు లిడిన ముద్దె
ఆలుతోడ జూదమాడి యోడిన ముద్దె
ఆజి వీరు మరణమైన ముద్దె. 440

కష్టపడక యెవఁడు ఘనుఁడయ్యె లోకాన
సుత్తె దెబ్బ దినక సొమ్మొటులగు
ఉడుకకుండ రుచ్య మోదన మ్మెటులగుఁ
గాల్చకుండ కుండ గట్టిపడునె ? 441

కష్ట సుఖము లెందు గల్గును సంసార
సాగరమున నెట్టి జనులకైన
సాగరమున రత్న సంతతితోఁ గూడి
తిమి తిమింగిలములు నమరుగాదె. 442

లచ్చిగల్గి హరియు రజతాద్రి మని హరుం
డెత్త లేదె బిచ్చ మేవపడక
ఘనులకేని దమది కాలమ్ము గానప్డు
ఒదిగి యుండవలసి యుండుగాదె. 443

తామె యెండనుండి తాప మొందుటనేమొ
పరుల తాపముడుపు తరుగణమ్ము
బీద బాధలెట్లు విత్తవంతు డెఱుంగు
గొడ్డురాలు బిడ్డ కుద్దెరుగునె? 444

ఒరుల మనసు నొవ్వఁ బరు సమ్ములాడకు
మనసు విరుగ నతికి కొనదు మరల
కుండబగుల నతుకు కొనదు కోటి యొనర్ప
గుండె బగుల నతికి కొనున దెట్లు? 445

తాను వస్త్రమ్ములో మోము దాచుకొనుచు
నేఁగుచున్నది శవ మది యేల యిట్లు?
విస్మయంబగుఁ జచ్చినవెన్క నైన
సిగ్గువచ్చెనొ తనదు చేష్టితము లరసి. 446

మానవత్వముతో నెందు మానవునకు
ఘనత చేకూరి, యున్నతి గల్గుగాదె!
చిన్నగానుండె కులమని చిన్నబోకు
చిన్న మనసును వీడు మోయన్న యెప్పుడు. 447

పదవి భాగ్య మరసి పడతి యాపూరుషు
మొగము చూచినంత మురిసియాడు
గగనమందు వెల్గు ఘన దర్శనమ్మున
నల మయూరి నాట్యమాడు కరణి. 448

కులమ దేదియైన గుణము బాగుండిన
జగతియెల్ల వాని సన్నుతించు
కలమ దేదియైన గవిత బాగుండిన
దత్కవీంద్రుఁ బొగడుఁ దాను ప్రజయు. 449

పరుల కలత్ర వెట్టు పాపి దుశ్చర్యలు
తెలియకుండ దాగగలవదెట్లు ?
వాడి సూదులన్ని వస్త్రమ్ము లోపల
మూట గట్ట దాని దాటిరావె. 450

మంచి మానవులకె మహిఁ గష్టములు వచ్చు
మూర్ఖులెందుగూడ మురియు చుండ్రు
పండ్ల చెట్లకెందుఁ బలురాతి దెబ్బలు
వట్టి తరువు నెవఁడు ముట్టబోడు. 451

ఆలు వచ్చు వరకె యన్నలు దమ్ములు
అమ్మ నాన్న మరియు నక్క చెల్లె
శ్రీలు గల్గువరకె చిత్ర ప్రపంచమ్ము
చూలు నిల్చువరకె సుదతి సుఖము. 452

లోకులెల్ల మెచ్చు నేకృతినైనను
వట్టి కుత్సితుండు తిట్టిపోయు
పరమ రుచికరంబు పాయసాన్నంబైన
జ్వరితుజిహ్వ కదియె యరుచిగాదె. 453

మంచినెందు రూపుమాపగ నరుదెంచు
చెడ్డ, మంచి కెపుడు చేవగూర్చు
తరువు కెందు దోహదముసేయు, బెకిలించు
త్రవ్వటమ్ము వోలె దనరు నెందు. 454

బంధమెల్ల ప్రేమబరగు నందాకనె
యందమెల్ల యువత యలరు వరకె
మనసు గల్గువరకె మన సుఖదుఃఖాలు
తనువు గల్గువరకె తక్కు జగము. 455

మేలు గోరువారు చాల కోపించిన
నధికభక్తి జనము లాదరింత్రు
జిహ్వ రుచి నొసంగు చేదు కాకరనైన
నమితకాంక్ష జనము లాదరింత్రు. 456

కులము తక్కువైన చులకందనమురాదు
గుణముగల్గెనేని ఘనత జెందు
గంగనీరు మలినగతి నుండెనేనియు
అమల కూపజలము నాదరింత్రు. 457

గుణవిహీనుఁడెందు ఘనత గోరగనేల ?
గుణయుతుండు ఘనత గోరనేల ?
మల్లెపూలె యెందు మౌళిఁదాల్చు జనమ్ము
ఉమ్మెతలను దలన నుంచఁబోదు. 458

పరగుణములె యెందుఁ బరికించి మదిలోన
మురిసి పడును రసిక వరుఁడు తాను
పిణుదుజోలిఁ జనక ప్రేమతో వత్సమ్ము
పాలు ద్రావి తనివిఁ బడయునట్లు 459

కష్టపడెడి యా యదృష్ట హీనునె కని
వలచి వచ్చు దుఃఖములు నదేమొ !
పదిగ గోరుచుట్టు పైనె రోకటిపోటు
పడునుగాదె యింక బాధగూర్చ. 460

కులమునందు నొకఁడు గుణహీనుఁ డున్నను
వంశమునకు నెల్ల వచ్చు మచ్చ
మంచమందు నొక్క మత్కుణంబున్నను
బడిత పూజ లొందుఁ బడక యెల్ల. 461

అరసికుండు సుకవి తాలాపములు విని
మెచ్చుకొనడు నెత్తి నొచ్చుకొనును
చెవిటివాని ముందు శంఖమ్ము నూదిన
నెముక గొరుకు నంచు నేవగించు. 462

ఆత్మ తృప్తిలేని యధమున కెన్నేని
సంపదలు వెలుంగఁ జాలయేప్పు
నేత్రహీనున కిల రాత్రిం బవళ్లను
కారు చీకటులివి కనఁబడునటు. 463

రసవిహీనమగుచు పసలేని కవితం
వ్రాసి యురక పాడ వలచు నెవఁడు ?
కీచురాయి యెంతగీపెట్టినను దాని
గాన తాన మెవఁడు కాంక్షసేయు. 464

అజ్ఞుఁ డెంత కవిత నాదరించిన నేమి
నిందసేయ నేమి నిష్ఫలంబు
అంధుఁ డెంత రంభ నాదరించిన నేమి
ఏవగించుకొనిన నేమి ఫలము. 465

అమ్మవంకవారె యాత్మీయులను స్త్రీలు
మగనివంకవారు పగతులంద్రు
జలధినుండి పుట్టు జలదముల్ నదములై
యబ్ధిఁ గలయనెంచి యరుగునట్లు. 466

ఐకమత్యమున్న నాత్మీయ రాష్ట్రింపు
చీమ లెన్నియైన నుడుపవచ్చు
కుండ చిల్లిపడిన కూర్పవచ్చును గాని
ముక్కలైన నావు పెక్కురణిని. 467

పేదవాని గుట్టు భేదింపవచ్చును
ధనికు గుట్టు దెలియఁ దరముగాదు
గండశిలల వెనుక గలదేదొ కనవచ్చు
నెత్తుకొండవెనుక నెఱుఁగఁదరమె. 468

ఒక్క డెంతయేని యోగ్యుఁ డైననుగాని
నలువు రాదుకొనమి వెలుఁగలేదు
ఒక్కయన్న మెంత యుత్తమంబైనను
కూరగాయ లేమిఁ గుడువఁ బడదు. 469

ఒడలుపైన మైల గడుగవచ్చును గాని
ఎడదఁగల్గు మైల నెటు గడుగుట
పైన దుమ్ము శుభ్రపరచ వచ్చుద్దాన
నడుగుమైల నెట్లు తుడువవచ్చు ? 470

ఆలుగల్గువరకె యతనిది సంసార
మవల వీని నెవ్వరడుగువారు
చంద్రుఁడుండు వరకె జలనిధి పొంగులు
చుక్కలెన్ని యున్న లెక్కయేమి ? 471

విద్య సుగుణవితతి వెలయుచుండిన నేమి ?
ధనికు నాదరించు ధనికుడెందు
కాకి యొందుఁ దాను కాకుల దరిఁజేర్చు
కోకిలమ్మగాలి సోకనీదు. 472

అతిపరిశాంత బుద్ధి యమలమై తానున్న
సూక్ష్మ విషయములను జూపగల్గు
అతిప్రశాంత నిర్మలాకృతి నీరున్న
అడుగునంటు వస్తు వగపడుగదె. 473

మగనియాజ్ఞలోన మగువ తానడచిన
గాలిఁదూలు కొమ్మవోలె నొప్పు
మగువయాజ్ఞలోనె మగడు తానడచిన
తాలవృంత మిచ్చు గాలి యగును. 474

అవసరార్థి యెప్పు డతిమంచివర్తన
గలిగియుండు ననుచుఁ దెలియవలెను
శిరము వంచియుండు జీవన రక్షకై
ప్రిద్బవెట్టు నదులు బారువేళ. 475

దేవుని దయయున్న నేవిధి నైనను
భాగ్యలతలు పండి భోగ్యమనెదు
నీరుగాగ దేవుని దయ వర్షించినన్
వేరు నీపరియత్నవిధి దలంప. 476

అరయ వెనుకముందు లాలోచన మొనర్చి
చేయు కార్యమెందు సిద్ధిబొందు
ముందువెనుక నడచు మోట బొక్కెనయది
నీరు కడుపునిండ నింపితెచ్చు. 477

చతురునకు జడునకు సమపీఠి వెలసిన
యంత మాత్రలోనె యతని సముఁడె?
పుత్తడికిని సమత నిత్తడి బాటులు
తులను దూగినంత విలువ సమమె? 478

మంచి సేయునట్టి మానవుఁ డొకడైన
నుర్వి ప్రజకు లాభమొదవు దాన
చెరువు వేయు నొకఁడు చేపలు కప్పలు
ప్రాణికోటి యెంతొ బ్రదుకుచుండు. 479

పూయు పూఁత యెల్ల కాయలు గాబోదు
ఉఱుము మబ్బులన్ని కురియ వెందు
ఊరుతరగలన్ని పారము ముట్టవు
ఆశలెల్ల సిద్ధి నందవెపుడు. 480

భయము చూపినంత బరువిడు నరుఁ గాంచి
వెంట బడెడి వాఁడు వెఱ్ఱి కుక్క
కాసు లాసఁ జూప దాసోహ మనువాఁడు
మాన మమ్ముకొనెడి సాని పడుచు. 481

ఏసలేవి యైన బాసతా నొక్కండె
భాష లేవియైన భావమొకడె
మతము లేవియైన మనుదేవు డొక్కండె
పూ లెవైన తేనె జాలొకండె. 482

అన్నదమ్ములెందు నన్యభావము పూని
కలహముం బొనర్పఁ గార్యహాని
మధ్యవర్తికేల మనజుట్లు నిడనేల ?
పిట్ట పిట్ట పోరు పిల్లి దీర్చు. 483

ఎగుడు దిగుడు బాట నేఁగుచున్నది బండి
సమత పాటఁ బాడు సారథయ్యా
ముందు బండినున్న మూర్తికి నెటు దెల్యు
వెనుక నున్న వారి వెత లవెల్ల. 484

మన్నుగాదు దేశమన్నచోఁ బ్రజలని
పలుకఁ బ్రజల సేవఁ దలపవేల ?
మన్ను రాయి రప్ప మన దేశమనినచో
మనదు నోటనింత మన్నె పడును. 485

దేశమే యిదొక్క దేవాలయంబని
దేశప్రజలు నాకు దేవత లని
యనెడి మతము నీదియై నప్పుడే యిల
పైన, స్వర్గసుఖము వడయగలవు. 486

ప్రణయ దృష్టి మించు ప్రబల బంధమ్మేది ?
మాతృప్రేమ మించు మచ్చులేవి ?
సరస కవిత మించు సద్గురు వెవ్వండు ?
మేలు సేత కన్న మిత్రుఁ డెవరు ? 487

వర్ణసుందరతలు వరలిన మాత్రాన
అర్థహీనమైన నదియుఁ గవితె?
ఎత్తితోలు గల్గనేమి? కోఁతిమొగాన
జూచునదియు నొక్కసుందరి యగునె? 488

పరగ సత్యమెంత పరమాత్మరూపమేన్
దయ యధీనమగుచుఁ దనరు టొప్పు
భర్త యెంతయేని పరమాత్మరూపుఁడేన్
భార్యవశగుఁడైన బరఁగు సుఖము. 489

మనసులం గదల్చి మతి వీణ శ్రుతిజేసి
తనువులెల్ల విస్మృతిని భజింప
చెవినిబట్టి తలలు చెప్పినట్లాడించు
నదియె కైత లేమి నదొక రోత. 490

నిలువ నీడనిచ్చి, విలువనుగొను నరుం
డడవి మ్రాను, విలువ లడుగ డెపుడు;
మ్రోడుమ్రానుకంటె ముఖ్యుఁ డెట్లు నరుండు?
మేలుసేయ లేనిదేల జన్మ? 491

సొంతమేలెకాని సోదర నరులకు
నుపకరించ లేకయున్న నరుఁడు
తనదు పొట్టఁ జూచుకొనెడి యా పశువున
కన్న తా నదెట్లు మిన్న యగును? 492

తనను దాను పొగడుకొను మూర్ఖుఁ డెందును
పరులనిందసేయు పతితుఁ డగును
చుక్కలల్పు లేను జూడుడి పూర్ణుండ
ననెడి చంద్రు డెప్పు డంతమొందు. 493

పాత్ర నరయకుండ పానీయ మానకు
వ్రాత చదువకుండ వ్రాలు నిడకు
మతి విచార ముడిగి మాటాడ కెప్పుడు
నవ్వి పలుకువారి నమ్మకెపుడు. 494

కవులు కృతులు వ్రాయఁగల వారలే కాని
అచ్చువేయ నర్హులనుట కల్ల
పికము లెందు గ్రుడ్లు వెట్టనేర్చునె కాని
పొదిగి పిల్లఁ జేయఁ బోవ వెపుడు. 495

అప్పు దీయనొక్క హరి వాసరము సేయ
బొజ్జ పెరుగు నొక్కబుస బిగింప
సకల జనుల ముందు సత్ప్రమాణ మొనర్ప
సంకుచితపుటెద విశాలమగునె ? 496

జార వృత్తితోడ సంతానమునుగన్న
జారిణికిని నట్టి సంతతికిని
తల్లిపైన మరియుఁ దల్లివైపున గల
బంధుకోటి పైనె పరఁగుఁ బ్రేమ. 497

వృక్షమెపుడు పండ్లవెలయుచు నుండిన
పక్షులన్ని వచ్చి పాడి యాడు
ధనము ధాన్య మెపుడు తన యొద్ద నుండునో
చుట్టములు నుతింత్రు చుట్టుజేరి. 488

కోతి మురిసియాడు కొమ్మలపై నాడి
నాతి మురిసియాడు నగలఁ గూడి
జ్యోతి వెలుఁగులీను చొక్కంపు నిశిఁగూడి
ఖ్యాతి వెల్గు ధర్మగతులతోడి. 499

కష్టముల సహింప ఘన సుఖమ్ముల బొందు
నరుఁడదెన్నడైన ధరణిలోన
మంట మాడిగాని మధురాన్నముల గూడ
దొరక ; వంట ప్రొయ్యినలరు పాత్ర. 500

ధనికుఁ డెందు బీద దశ గూడినంతనే
అల్పు డెత్తి పొడువ నదను జిక్కు
ఏనుఁగెత్తు పడిన దాని తొండమ్ములో
దోమచొరఁగ సందు దొరకుగాదె. 501

అంద మెంతయున్న, నమల సద్వర్తన
లేమి, విలువ నిడరు లేమ కెందు;
వన్నెగలిగి తావి వరలని మోదుగు
పూలఁ దలధరించి పూజనిడరు. 502

రామజపము సేయు రాత్రిం బవళ్లను
అనుసరింపఁ జాలఁ డతని నడత
దీపమనుచు భక్తి మాపులు జపియింప
అంధకార మెట్టు లడఁగి చనును ? 503

ఏను కవినటంచు నెరుఁగ జెప్పగనేల ?
జడుల ముందునన్నై సరసులందు
ఏను సుందరినని యెరిగించు కొననేల ?
అంధుముందు మరియు నద్దమందు. 504

పైడి విలువ నెంత పడగొట్టినను నేమి
కాంతి మాసి చనదు కళ లుడుగవు
సత్కృతులను కవికి సలుపకున్నను నేమి ?
సరస కవిత గుణము మరుగు పడదు. 505

ఎదుటివాని శక్తి నెఱుగకుండుట తప్పు
తనను దాను పొగడు కొనుట తప్పు
తనదు తప్పు నొప్పుకొన కుండుటలు తప్పు
ప్రభువుతోడ వైరపడుట తప్పు. 506

అతి కటువుగ మాటలాడకు మెప్పుడు
వేమటంచు నుమ్మివేయు జనము
అతిగఁ దీపి మాటలాడకు మెందును
చెఱుకటంచు పిప్పిచేయు నమలి. 507

బ్రతికియున్న పితకు మెతుకు వెట్టడు; పోవఁ
బితయటంచుఁ గాకిఁ బిల్చి యిడును
భక్ష్య భోజ్య చోష్య పాయస శ్రాద్ధమ్ము
లతని పేరుఁ జెప్పి యారగించు. 508

పంచముఁడు చిన్నవాఁడని పజ్జకేని
జేరనీయక వానిని దూరముంత్రు
ప్రేమ గన నగు గడగొట్టుబిడ్డనెందు
అకట కడకు గొట్టగ బాడి యగునదెట్లు? 509

అరయ సంఘమందు నవ్యక్తులెందరు
కలసియున్న నేమి? కార్య కారి
సున్న లెన్ని కలిపి యెన్ని మారులు గూడి
లెక్క సేయనేని యొక్కటగునె 510

పారునీట మట్టి పరిశుద్ధి నిసుకయౌ
నాగునీట మట్టి యడుసుగ నగు
సాగు ప్రగతి నొదవు జాతి వికాసమ్ము
కుంటువడిన ప్రగతి, కుళ్లు హెచ్చు. 511

ఒకచె కట్టెలోన నుద్భవించును పొగ
మంట గూడ దాని వెంటఁ బుట్టు
పొగయొ యేడిపించుఁ దగ మంట వెలుగిచ్చు
మొదలె శ్రమము కృతులఁ దుద సఫలము. 512

ఏనుఁ గాకసమున నెగసి యాడుచు నుండె
అనుచు నొక్కఁడనిన నవనిజనులు
నింగిఁ దేలి యాడు నీలిమబ్బులఁ గాంచి
తొండమదుగో యిదుగో తోక యంద్రు. 513

లోహములను గాంచి లోభియై దేహముల్
నష్టపెట్టునట్టి నరుఁడసురుఁడు
లోహలోభమడచి దేహాల సేవల
పోరిగ నాచరించు నరుఁడమరుఁడు. 514

అవసరమ్ము పైన నధికారి చర్యలు
గొనక యాలసింపఁ బనులు చెడవె
చోరు లింటబడిన యారుమాసములకు
కుక్క మొఱుగ ఫలము గూడునెక్కొ. 515

బలిసి మదము గొనిన బంటు తానేవేళ
ఆజ్ఞ కెదురు తిరిగి యాడుచుండు
వర్షహతిని నాని బలిసిన తలుపులు
తీయవేయ నెంతొ తిప్పలిడును. 516

పాపి జనుల నెందు బంధువు లనుకొను
వారు మూఢు లగుచు వనఁట గనరె
వ్రణమునందుఁ బుట్టువును బొందు క్రిములను
నాత్మబంధువు లని యందు రెవరు ? 517

కావ్యపాక మెపుడు కఠినమ్ము గాకుండ
నున్న సరసమగుచు నుల్ల ముబ్బు
లేత మొక్కయెన్ను మేతకై రుచిగొల్పు
ముదిరిపోవ నరుచి మొదలె కొల్పు. 518

ప్రాతయంత రోత పనికిరాదన బోకు
ప్రాతయయ్యు వేదమాత పూత
అంత క్రొత్త చెత్త యనకు సర్వజ్ఞశీ
ర్షగత గంగ నూత్నరస తరంగ. 519

ACC NO. 2461

నిజమునకును నెపుడో నింద వచ్చిన వచ్చు
అది నిజమయి దాని నంటబోదు
నిప్పు నెపుడో దాని నివురుగప్పిన గప్పు
నుష్ణగుణము నెందు నుడుపలేదు. 520

10200
808.881
VAR

ఎదుటివాని విషయ మింతేని దెలియక
తననె చతురమతిగఁ దలచు జడుడు
కనులఁ గాళ్ల నమ్మి కారుచీఁకటి నున్న
బాటనేఁగదలచు బాలిశుండు. 521

కొన్ని దుష్టశక్తు లున్నంత మాత్రాన
సంఘనిందఁ జేయఁ జనదు ప్రాణి
బియ్యమందు రాళ్లు వెయ్యిలో నొకటున్న
ఏరి వేయకుండ పారబోతె? 522

స్వర మధురిమ లేని సంగీత మది యేల ?
సొగసులేని మేన సొమ్ములేల ?
చతురవాక్కులేని సాహిత్య మది యేల ?
రసవిహీన కావ్యరచన మేల ? 523

వావి వరుసలేక వరలు కామంబేల ?
పాపభీతిలేని కోపమేల ?
ఒరుల కిడక తినక యుండు లోభమ్మేల ?
ముదిమి గదియు మేన మోహమేల ? 524

మంచి మరువఁజేయు మద మత్సరము లేల
శాంతి మదికిలేని సౌఖ్యమేల ?
సతియె యింటలేని సంసార మదియేల ?
తనదు పేరు చెఱచు తనయులేల ? 525

# ఈశ్వరుఁడు

దేహ మదొక దివ్య దేవాలయం బందు
జ్ఞానమనెడి దీప కళిక వెల్గ
ఆత్మయనెడి పురుషుఁ డందు రూపొందుఁదా
సకల కర్మలకును సాక్షియగుచు. 526

రసరూపుఁడు నారాయణుఁ
డసదృశ విజ్ఞాన వహ్ని నావిరియౌ భ
క్తి సరిత్సాగర హిమమయి
మసలున్నిర్గుణత సగుణ మహితాకృతులన్. 527

భూమియందు విత్తుఁ బుట్టించు శక్తియై
విత్తులోన మొలచు విమల శక్తి
యగుచు రెంటి నొకట నైక్యమ్ము నొనరించి
సృష్టి రచనసేయు స్రష్ట యతఁడు. 528

జన్మమిచ్చినట్టి జనకుఁ డీతండని
జనని చూపు భంగి సద్గురుండు
పరమ పదవి నొసఁగు భగవానుఁ డీతడని
తెలుపకున్న దెలియఁ దరమె వాని? 529

రూపులన్ని తా నగుచు నేరూపులేక
పేరులన్ని తానగుచు నేపేరులేక
విశ్వమును దాను గాంచుచు విశ్వమునకుఁ
గాన బడనట్టు లుండెడి ఘనుఁడతండు. 530

కాంచ జీవుఁ డీశ్వరుఁడును కాంతి మరియు
దివియవలె నుంద్రు గుణమయ యవనికయగు
మాయ, కాంతి న్నిరోధించు మందుదివ్వె
నంట భసితమౌ మాయ తా నంట దీశు. 531

నాది యనెడి రూప నామాత్మకము మాయ
నేనటంచు బల్కుఁ జ్ఞాని బ్రహ్మ
నాది యనెడి స్వార్థబాధల న్విడనాడి
యుండు నరుఁడె పూరుషోత్తముండు. 532

తనకుఁ దెల్యనంత దైవంబె లేడని
వచ్చినట్టులెల్ల వాగు ఖలుఁడు
పురుటి బిడ్డ యయ్యనెరుగని మాత్రాన
జనకు నునికి యెం దసత్యమగునె? 533

ఎన్ని రూపములను నిచ్చి పూజించినన్
ధ్యేయమందుఁ దలఁచు దేవుఁడనియె
అక్షరముల కెన్ని యాకృతు లిడనేమి?
పలుకు భావమొకటె బరఁగుగాదె. 534

గుణములేని నిన్ను గొల్చి పూజించుట
తెలియగలుగు టెట్లు దేవదేవ
గుణములేని శబ్దమును బల్కుటెట్టులు?
పలుకు లేక తెలియు భావమెట్లు? 535

రూపరహితుఁ డీశ్వరుండని వచియింప
ధ్యాన మెటు లొనర్చు వాని నెడఁద ?
ధ్యానమేని లేక దైవచింతన మెట్లు ?
చింతనమ్ములేక సిద్ధియెట్లు ? 536

నాది తనువు మనసునాది బుద్ధియునాది
నేను వేరె యనుచు నిజము దెల్ప
మేనె నేనటంచు జ్ఞానహీనుండవై
దివ్యశక్తి నాత్మఁ దెలియవేల ? 537

తనదు కృషికిఁదోడు దైవసహాయంబు
కలిగినను ఫలించు కార్యమెందు
కన్నులున్న నంధకారాన దీపంబు
వెలుఁగు లేమి, నడువఁగలఁడ దెట్లు. 538

ఈశు నెందు జ్ఞానహీనుండు లేదన్న
నెట్లు లేకయుండు నీశ్వరుండు
తిమిరమందు వస్తుసముదాయములు తాము
కానబడకయున్న లేనివగునె ! 539

విశ్వమందు దాగి విద్యుత్తు గ్రాలును
కాని కన్నుగవకుఁ గానరాదు
దాని బ్రకటపరచు తత్త్వజ్ఞుసరణిని
జ్ఞానియొకఁడె యీశుఁ గాంచగల్గు. 540

నీవుగలవని వాయువుల్ నిఖిల దిశల
గుసగుసలు వెట్టుచున్నట్లు గోచరించు
తరువులెల్లను నిజమంచుఁ దలల నూపు
విధము దోచుచునుండె నో విశ్వవిభుఁడ ! 541

అంబరపు తెరమరుగున నలరునట్టి
సూత్రధారివై లోనుండి చూతుమమ్మ
ఇవల నటియించుపాత్రల కీవు మాకు
నెపుడు గనరావు జగముల నేలుఱేడ ! 542

అఖిలభూత జీవనదాతవైన యట్టి
ఘనుఁడ వీవని యో త్రిజగన్నివాస !
అంబుచయములు స్వీయ శుద్ధాంతరంగ
దర్పణమ్మిడి చూపువిధమ్ము దోచు. 543

కనులు మూసి స్వప్నమును గాంచు బాలుండు
మాత తనదుప్రక్క మను టెరుఁగఁడు
కలవరించి భీతిఁ దెలివొంద నోదార్చు
తల్లియునికి యపుడు తెల్లమగును. 544

నాస్తికత్వ మమావాస్య నాటి రేయి
ద్వైతగతి శశితార కోపేత నభము
నిర్మలా ద్వైత భావమ్ము శర్మదమగు
సవితఁ గూడి ప్రకాశించు దివము సుమ్ము. 545

నాస్తికుండు తాను నారాయణుండే లే
డనిన యంత నేమి యగును హరికి ?
చూపులేని గ్రుడ్డి సూర్యుండె లేడని
నంతవాని కాంతి యరుఁగగలదె ! 546

మేనుగాంచి యిదియ నేను నేనని పల్కు
మేను నిచట విడిచి నేను జనును
అది యెఱింగియుండి యాత్మ నేనని తెల్య
డిట్టి యజ్ఞువిషయ మేమనవలె ! 547

ఇహసుఖమ్ము దప్ప నేలోకములు లేవు
పరసుఖమ్ము వట్టి భ్రమ యటన్న
స్వప్న జగతినుండి స్వప్నేతర జగత్తు
కల్లయనెడి వెకిలిగాదె తలఁప. 548

ఎన్ని మతము లేని యీశ్వరుం డొక్కండె
భాష లెన్ని యేని భావమొకడె
పలురకాల పూలఁ బరఁగు తేనె యొకండె
ఆల రంగెదైన బాలొకండె. 549

వింత సింగిణీ రంగుల పెట్టె విప్పి
యాకసపు పళ్లెరమ్మున నరుగఁదీసి
క్రమముగా నన్నివర్ణముల్ కఱఁగి పార
రవికిరణకూర్చఁ జిత్రాల వ్రాయు నెవఁడు ? 550

అలిని బసరికరంగు నాకులకు రుద్ది
రుచిర పరిమళ మధురస రూపవితతి
పూల గిల్కొల్పి వన్నెలు పొందు పరచి
విశ్వ చిత్రమ్ము విరచించు విబుధుఁ డెవఁడు ? 551

తనదు సృష్టికిఁ దను గన్న తండ్రి కర్త
ఆదిమానవు గన్నట్టి యయ్యలేడె ?
ధరణి నొక సౌధముం గట్టఁ దాను కర్త
ధరణికర్తయా దేవుఁడు తలఁపురాడె. 552

అంతరింద్రియ బహిరింద్రియముల కెవ్వ
డందకుండ లోవెలుపల నమరియుండు
నట్టి వేదాంతవేద్య జ్ఞానైక సాధ్యు
నాత్మ నీశ్వరుఁ డంచు నెందరయు టొప్పు. 553

రూపులన్ని తానయి కనుపాప యటులు
నిజ సితాశ్యంతరస్థక నీనికముగ
అల మహోదధి వలయి తాజాండ మెల్ల
పాలన మొనర్చుచుండు నీశ్వరుఁడెపుడును. 554

సున్నయై యంకెలను సృష్టిఁ జేసి పెంచి
అన్ని వ్యయముగా నొకఁడెతానలరుచున్న
యా స్వరూప విరహితుడు నఖిలరూపు
డవ్యయుఁ డమూల్యుఁడును పూజ్యుఁడగునతండె. 555

భూతకోటి మానసగత చేతమగుచు
అతఁడె వెలయును నేను నే ననుచు దెల్పి
అన్నిరూపములందున నున్న దొకఁడె
యనుచు సమదర్శియై యుండు నతఁడె బుధుఁడు. 556

సుత్తెతప్త లోహము లఁదా మొత్తి వివిధ
నామ రూప మూలకమయి యేమి మార
నట్లు వివిధ రూపాఖ్యల నందఁజేసి
చిత్తు విగత వికారియై చెలఁగుమేన. 557

## వైరాగ్యము - జ్ఞానము

కాకిబంగారమున బైడికలిమి యెంతొ
కుక్కగొడుగు గెండకై యనుకూల మెంతొ
నేతి బీరలోనుండెడి నేయి యెంతొ
యరయ సంసారమన సారమంతె కలదు. 558

నాల్గు నాళులుండి నాశమౌ మేనికై
సకల సుఖవసతుల సంతరించు
నద్దెకొంప నెంత దిద్ది తీర్చిన నేమి ?
విడువ మన్న దినము వెడల వలెను. 559

మేనుగాంచి యిదియె నేను నేనని పల్కు
మేని నిచట విడిచి నేను జనును
అది యెఱింగి యుండి యాత్మనే నని పల్కు
దిట్టి యజ్ఞు విషయ మేమనవలె. 560

మాయవలల బన్ని మచ్చుగా నిడెనందు
స్వల్పవిషయ సౌఖ్య సంచయమ్ము
వాని మేయబోయి వలఁ జిక్కెనీ ప్రాణి
కాలుఁ డనెడి వేటకాఁడు మరియ. 561

తానెపోవు నెఱిగి దారపుత్ర వియోగ
మునకు నేడ్చు ప్రాణి ముగ్ధుఁడగుచు
తలయె పోవునన జెవుల పోఁగుల కునేడ్చు
వాని నేమి యనఁగ వలయుఁ బుడమి. 562

దేహముండు వరకె దేహ బంధువులెల్ల
వారెవారొ పిదప వీరెవారొ
నాల్గు నాళ్ల కొఱకె నా వారు పరవార
లనుచుఁ బాపవాపి మునుఁగ నేల ? 563

ఆత్మ తరణమునకు నవయవమ్ము లొసంగ
నవయవ సుఖములకె యాత్మ యనును
ప్రొద్దుగ్రుంకె నెడ్లఁ బులుమేపు టందిఁకఁ
దనదు మనికిఁ జేరఁ జనుట లెపుడు ? 564

నేనె విడిచిన పీగుడి నేలఁ గూలు
నెట్టులను గబ్బిలపు బండపట్టువోలె
ధరణి భరమెల్ల నాపైనె నొరిగె ననుచు
భావన మొనర్చి యారాటపడు నరుండు. 565

తల్లి చంకనున్న తనయుని బరకాంత
బలిమిఁ గొనిన నచట నిలువ కేడ్పు
దివిని హరిని బాపి భువి మాయగొను పాప
కేడ్పు దప్ప నింక నెచటి శాంతి. 566

గాలి త్రోపులఁ గాలాబ్ధిఁ దేలియాడు
జన్మలను తరంగమ్ము లీజలధిఁ జనుచు
తీరమును ముట్టునో మధ్యఁ దీఱిచనునొ
దీపమున్నప్డె యిలు చక్కదిద్దవలదె. 567

బాల్యమొక పంజరపు చిల్క పర్వులెత్తు
జవ్వనము పాల పొంగు, ముసలితనమ్ము
పాటిఁదప్పిన కొలఁబ్రద్ద, భయద మృతియొ
కాచుకొనియున్న పులి, బందెకాన బ్రతుకు. 568

కాంచ జీవితమొక ముండ్ల కంప దీన
పొదము పూలయి సుఖములు పూసిపోవు
చుట్టపుం జూపులై సుఖాలిట్టెపోవు
ఇంటివాళ్లట్లు దుఃఖమ్ము లెపుడు విడవు. 569

ముందువైపు మోకాలి కీల్మడువలేదు
వెనుకవైపు మోచేతి కీల్గొనగలేదు
పరిమితాధి కారముగల పురుగు నరుఁడు
పరమ పురుషుఁడ నేనని పల్కవశమె. 570

ఈ ప్రయాణము తుదలేని దిందు స్వపథ
విలసితోపాంత కాసార జలధి మున్గి
నవ్య వస్త్రధారణము నొనర్చి పేర్మిఁ
దెచ్చుకొనిన పాథేయముఁ దినిచననగు. 571

నాది నాదను భావమ్ము పాదుకొనిన
కలన మమతాను బంధమ్ము కలతవెట్టు
కాదు కాదను భావమ్ము గఱపుచుంట
సతత వైరాగ్య సిద్ధిచే వెతలడంగు. 572

మధుప మంబుజసంగతిన్ మధు విమత్త
చిత్తమున నిజధామంపు చింతమరచి
రజని గని ముకుళించు నీరజమునందు
జిక్కి మడియు వినిర్ముక్తి ఫక్కి గనక. 573

బిగి వీడిన నరములవలెఁ
దెగిపోయిన పంజరాన దేలుఱుకంబై
యెగసిచను నందమనునది
గగన చలచ్చంచలాను కారిణి యగుచున్. 574

కటికకాలుండు సంసార గహ్వరమున
వచ్చి పడిన జీవులకు యౌవన వనస్థ
జీవన గ్రాసమిడుచు నిశ్చింత మేపి
పెంచుటలు కోతకనుచు భావించ రయయో. 575

మానవీయ జీవనదిన మార్గమధ్య
గత తృతీయయామమ వార్ధకమ తమిస్ర
మిశ్ర సంధ్యా ప్రదోషమా! మిత్రవైరి
స్వతను పూర్ణేందు కృష్ణ పక్షమ ! నమోస్తు. 576

సురవంటిది యైహిక సుఖ
మరయన్ సుధవంటి దెందు నా ముష్మిక సౌ
ఖ్యరమ యని బుధులు దెల్పిరి
యరయంగా రెంటిలోని యంతర మెంతో. 577

బుద్ధి గ్రాహ్య మతీంద్రియ
మిద్ది యనుచు సూక్ష్మ సుఖము నెరిగిరి పెద్దల్
బద్ధులు విషయ సుఖమ్ములె
పెద్దవిగా దలచి వాని బ్రేమింతు రొగిన్. 578

ఐహికాస్థిర సుఖలాలసాతురుండు
ప్రబల మాయా వశుండునై ప్రాణి యెందు
పవన హతిఁ జంచలత నాడు దివియవోలె
దెరలు పరమార్థపద భక్తివరలకున్న. 579

కాంతా కాంచనములు గన
నెంతటి వారికిని వెఱ్ఱి యెత్తించును దద్
భ్రాంతిని విడువఁ బ్రపంచ
మ్మంతటినిం గెల్చు యోధుఁడగు నానరుఁడే. 580

వెతలొన గూరిచెడి యశా
శ్వత పుత్ర కళత్ర విత్త వసుధాలయసం
గత కృతక సుఖములప్రా
కృత దివ్యానంద పదవి కెనయగు నెట్టుల్ ? 581

తనువు నాదె మరియు ధనమెల్ల నాదని
వింత మాటలాడి వెఱ్ఱి వైతి
వీని వెంట గొంచువేం చేయవది యేల ?
వద్దటంచు ననిన వారెవారు ? 582

వడిఁగ మృత్యువంపు వార్ధక్య మదివచ్చి
జుట్టు పట్టి యీడ్చుచున్నగాని
జనుల మోసగించి సంపాదన మొనర్చి
కూర్చఁ జూతు వెవరి కొఱకు నీవు ? 583

ఒరులు చూడకుండ దురిత కార్య మొనర్చి
దొరుకనైతి నంచు మురియు జడుఁడు
ఎవరు చూడకున్న నీశ్వరుండే వేళ
గుండె నుండి చూచుచుండుఁ గాదె. 584

సకల సుఖములమరు సంసారమం దని
యంధులగుచు దాని నాశ్రయింత్రు
క్షణము సుఖముకొఱకు జన్మకష్టంబుల
ననుభవించ వలయు ననుటఁ గనరు. 585

సతికి సుతులకంచు మితిలేని కష్టంబు
సలిపి కూర్చిపెట్టు జడుఁడు తాను
ఆత్మవోవు వెన్క నతఁడేడ ? సుతుఁడేడ ?
శ్రాద్ధ పిండమైన సరిగ నిడఁడు. 586

బాల్య వృద్ధతల్ సుఖపడఁ బనికిరావు
కాంచ యౌవన కౌమార కాలములవి
నిర్గమించె నాధి వ్యాధి నిద్రలందె
మూడు పాళ్లు, జీవిత సుఖము గన నెంత ? 587

అన్నవస్త్రమ్ములకు నై ధనార్జనమ్ము
నేయఁగ ధనమదాంధుల సేవలోన
ఆత్మనే చంపుకొని వారి యడుగులకును
మడుగు లొత్తి తొత్తగువాఁడు మానవుండె. 588

పదమ లాత్మాభిమానముఁ జంపుకొనుచు
శునకమటు లింత గూడును దినుట కంటె
అడవిజని స్వేచ్ఛగా నాకు నలము గుడిచి
పాలొసఁగు గోవువై పూజ్య పదవి గొనుము. 589

అధికార ధనమ దాంధుల
బధిరుల నేవేళగొల్చి బ్రదుకుట కంటెన్
విధనమ్ము మేలుగాదె వి
బుధుఁడై నిష్కామ సేవ బూనిన సుఖియా. 590

ఆయువరిగిన కొలది తా ననవరతము
చనదొడఁగె కాలసామీప్యమునకె ప్రాణి
ఇది విషాదాంత నాటకమిందుఁ జివర
మంగళము బాడఁగల్గు సమర్థుఁ డెవఁడు ? 591

పాంచ భౌతిక సోదర భావగతిని
చల్లగా దేహరథమెట్లొ సాగు, గాని
పాలిపగ నివి కచ్చుకుఁ గాలు ద్రవ్వి
కుపితగతి వేరుఁబడఁ గొంపగూలిపోవు. 592

జలము వహ్నికి నాజన్మ శత్రువె కదె
అగ్ని జలము నావిరి సేయ నరయుచుండు
వాయువో యవ్యవస్థితవర్తి ధరణి
వీరి స్థిరమైత్రి నెవ్వండు విశ్వసించు 593

కనులు మూసిన కదలేని గమన మనును
కనులు దెఱచిన నిచటనే కలననుకొను
మహిని గానుగెద్దు పథగమనము వోలె
కాలచక్ర యాత్రకొకప్డు కడయెలేదు. 594

మైవెలుఁగు వర్ణముల నీడ మాయఁ జేసె
సరస హాసవీక్షణ శోభఁ జెరిచె నీడ
భూశయనమొందె రూప వపుఃప్రతియును
మేనితోబుట్టు వీనీడె మృత్యువరయ. 595

ఇరులడఁచు రవికరాళిం
జిరునీడపట మ్మొకింత చెడునె సవిత ముం
దరుదెంచ వెన్నడఁగు వెన్
బరతెంచిన విడకమ్మందు వచ్చు మెలకువన్. 596

బాలవృద్ధార్కులం గని చాలపొడవు
పెరుఁగు మధ్యాహ్నరవి గని తఱిఁగి కాళ్లఁ
బట్టుకొని మరుంగగు నీడ బ్రహ్మచర్య
యుతయువకుచెంత నడఁగి యిట్లుండు మృతియు. 597

భావమందు నెందుఁ బగవాని దలచిన
నగ్ని యగుచుఁ గాల్చు ననుదినమ్ము
అరికి నర్పితమగు నంతరంగమ్మును
హరికి నీయ శాంతినలరు గాదె. 598

అమృత మెచటనో సురాలయ మందున
కలదటంద్రు దానగార్యమెద్ది ?
సద్గురూపదిష్ట సరస విజ్ఞానమే
యమృతమగును గాని యన్యమగునె ? 599

వయసు రూపు బలము వైభవమ్మును గని
పరులు నొవ్వ గర్వపడకు మెందు
కోడిపిల్ల నట్లు కొట్టుక పోవెడ్డా
కాలుఁడనెడి గ్రద్ద కాలదన్ని. 600

ధనికు లెందరోయైరి యీ ధరణి పైన
బీదజను లెందరోయైరి భేదగతుల
తలఁప వారెల్లరును మట్టిఁ గలియు పిదప
మట్టిలో మట్టి యగుచు సమానమైరి. 601

అగ్నిమంట ముందె యరుదెంచు పొగవోలె
అజ్ఞదశయె మొదట నావరించు
ఊదిపొగ నడంప నొదవు మంటలవోలె
బోధతోడ నరుఁడు బొందుఁ దెలివి. 602

పండితుల సువాక్కు పాటింపకయె శఠుం
డిష్టమైన చెడును శ్రేష్ఠమనును
కపిల గోవులెల్ల గంగ నీరానును
దున్న కెందు బురదయన్నహాయి. 603

పరమ మూర్ఖుఁ డెందు పండితోత్తములతో
వాదు వెట్ట బుధులు సాధువంద్రె
కారు దున్నపోతు గజమట్లు పెరిగినన్
దాని నెక్కఁగలరె ధరణి పతులు. 604

# దైవేచ్ఛ

కాంతిలేక వర్ణం బుండి కనబడనటు
గాలిలేమి శబ్దము వినగల్గమియటు
లవని దైవేచ్ఛ లేమి మానవునియత్న
మింతయునుగూఢ ఫలియించ దెయ్యేడలను. 605

ఇత్తుననుచును దాత వాక్కఁడగవచ్చు
ప్రతిగృహీత కైకొన నాసపడగవచ్చు
మనుజసంకల్పములకుఁ బైమనెడి శక్తి
యిచ్ఛలేకున్నఁగొనుట గాదిడుటగాదు. 606

సూన హృదయమ్ము మధువు నిచ్చుటకె విప్పె
అర్థియై మధుకరముపేరాస నరిఁగె
వాయువంతలో విరిని నవ్వసుధ రాల్చె
కుడుచు మధుకర ప్రాప్తమొ కుసుమగతియొ. 607

పైన శ్యేనంబు వేటాడుఁ బక్షికాంతఁ
గ్రింద వ్యాధుండు గురివెట్టి కెడపఁ జూచు
ఎట్లు నా జీవితంబిక యెవఁడు తాను
రక్షకుండని యేడ్చె నాపక్షియంత. 608

అంతహరికృప నదియేమొ వ్యాధు పదము
పడియె వల్మీక బిలముపై బామొకండు
పదముఁ గుట్టెను గురిదప్పి బాణమంత
శ్యేనముం దాకె వ్యాధుండు ప్రాణముడిగెఁ 609

ఎంతవాఁడును దావకాహేతుకదయ
వడయకున్న కృతార్థుఁడై వరలఁ గలఁడె
వాయుదేవ తావ్యాజకృపా ప్రసరణ
లేక యగ్నితానై వెల్గ నేకరణివి. 610

కష్టపడియు దైవకారుణ్యమబ్బినన్
గాని సఫలదశను గనవు పనులు
ఎంతొ కృషి యొనర్చియేని వానలకునై
యెదిరి చూడవలయు నెపుడు రైతు. 611

# భక్తిమహిమ

మోక్షసిద్ధికొరకు మూడు సాధనములు
గలిగియుండవలెఁ ద్రికరణ గతుల
కలిని జ్ఞాన భక్తి కర్మయోగంబులై
చెలఁగు నివియె విబుధ సేవ్యములుగ. 612

జ్ఞాన మెడఁదలోన ధ్యానరూపత వెల్గి
ప్రేమ సూక్తి నీశునామభజన
కామరహిత దివ్యకర్మంబు క్రియలందు
గలుగువాడు భక్తినలరువాడు. 613

ప్రకృతి క్షణికమనుచుఁ బరమాత్మ తా నెందు
నిత్యుఁడనుచు నాత్మ నిజము నెఱిఁగి
ప్రకృతి సంగమందు వైరాగ్యమూని స
ర్వేశుఁ బ్రాప్తిఁగోరు నెడఁద మౌని. 614

స్వస్వరూపాను సంధాన సరణితాను
నిర్మలాద్వైత భక్తియై నెగడుచుండు
ఎడతెగని తైలధారగా నీశుస్మరణ
భవ్యగతి విశిష్టారాధ్య భక్తి యగును. 615

శక్తికి లొంగక శాస్త్రపు
యుక్తికిని నతీతుఁ డగుచునుండు నృహరి తా
భక్తికి వశుఁడై శాశ్వత
ముక్తి ప్రదుఁడై వెలుంగు ముందుఁ జెలంగున్. 616

ముక్తికాంత భోగమునకు సర్వస్వము
త్యాగమొసఁగు ప్రేమధనము భక్తి
శౌరి రూపశీల సమితి నవిచ్ఛిన్న
తైలధారవంటి తలఁపు భక్తి. 617

అఖిల భుక్తములను హరియించుజఠరాగ్ని
యటులు పుణ్యపాపహతి నొనర్చి
యంబు భేదముడిపి యబ్ధిజేర్చెడి గంగ
వడువు హరిసమైక్యమిడును భక్తి. 618

మేదిని సనాథ యగు న
న్మోదత నాడెదరు సురలు నాకస్థితులై
మోదింతురు పితరులు భ
క్తోదయ మైనంత హరికి నుత్సవ మొదవున్. 619

విత్తరూపవిద్యాకుల భేదముడిగి
ముక్త సంగులై చరియించు భక్తవరుల
నాశ్రయించెడివాడు గాకన్యుఁడెవఁడు
కలిని భవవార్ధిఁ దరియింపఁ గలఁడు తలఁప. 620

కులము తరియించుఁ బూతయైయిల వెలుంగు
తీర్థములు సుతీర్థములయి తేజరిల్లు
శాస్త్రములును సచ్ఛాస్త్ర ప్రశస్తిఁ గాంచు
భక్తజనన సంస్పర్శన భాషణముల. 621

వాదమ్ము లుడిగి మూకా
స్వాదనగతి హరిగుణానుభవపీయూషో
న్మాదుండై యేకాంత వి
నోదత నగు నేడ్చు వాకొను న్ననుదానే. 622

ఔరసుఁడని విధికి నామ్నాయ ధనమిచ్చె
సతి యటంచు రమకు స్వాంత మొసఁగె
ఐననేమి భక్తుఁ డార్తుఁడై పిల్చిన
వీరి విడిచిపుచ్చి వెడలివచ్చు. 623

ఔర నేను తండ్రియంతటివాడను
వేరుబడెదనను కుమారునకును
తనదు భాగ్యమెంతో తగనంతెయైన కై
వల్య సుఖము లబ్బి వరలు నెందు. 624

తండ్రితోడ నేను దగ సమానుఁడగాను
జనకు విడిచి నొకఁడ మనగలేను
అనెడి సుతుఁడొ యెందు నాహరివైకుంఠ
పూర్ణధన సుఖాలిఁ బొందుఁ దాను. 625

అఖిల ప్రాణులందు హరియె యున్నాడని
యెట్టి ప్రాణికైన హింసనిడక
సకల భూతకోటి సమదృష్టి సేవించు
వాడె భక్తవరుడు, వసుధనెందు. 626

చాడి చెప్పుటలు నసత్యంబు వల్కుట
ఒకరి నింద సేయుచుండుటయును
వ్యర్థభాషణముల వదరుచుండుటయును
లేనివాడె భక్తుడౌనుదాను. 627

జార చోరకృతుల నల్పకుండుటయును
బ్రాణిహింస వీడి బ్రదుకుటయును
సత్యవర్తనముల సంచరించుటయును
కలుగువాడె భక్తి కలితు డవని 628

ఎదదురాశ గెల్చి యెపుడు రాగద్వేష
ములకు వశుడుగాక మెలగువాడు
కామ కోప లోభ ఘనమోహ మద మత్స
రతల నడచు భక్తియుతుడు సతము. 629

కష్ట సుఖములకు శ్లాఘ నష్టములకు
సరవి నిందాస్తుతులకెందు జనన మరణ
ములకు గలత వెట్టెడి ద్వంద్వములకు వశుడు
గాకయుండు నాతడె భక్తికలితు డెందు. 630

వినయభూషణుండు వీతగర్వుండును
స్థిరమతియును దైవచింతకుఁడును
నాది యనెడి దెదియు లేదనువాఁడును
వైరముడుగు నతఁడె వైష్ణవుండు. 631

చేఁపవలె నాల్కకై మృతిఁ జెందకుండ
అంగముల నియమించు కూర్మమవుగమ్మ
అన్నవస్త్రాల కాత్మనె యమ్ముకొనెడి
నరులకన్నను నడవి వానరులె మేలు. 632

## మోక్ష మహిమ

ధరనగణ్య పుణ్యధనముతో భవవార్ధి
పారమేఁగ మేను పడవగొంటి
అద్దితాను భిన్నమగుటకు ముందె వే
జేరవలయు ముక్తితీరమునకు. 633

కామపూర్తికొఱకు గడియింపవలె నర్థ
మర్థ కామసంచ యాప్తి యందు
నియమపాలనమ్మె నెఱపుటే ధర్మమ్ము
అరయ వీ త్రివర్గమైహికమ్ము. 634

వర్ణమత విభేదవైఖరి వాలించి
యన్ని నేనెయనుచు నాత్మనెరుఁగు
భేదవాద ముడుపు వేదమే యద్వైత
భక్తియగుచు దుఃఖముక్తి నొసఁగు. 635

అఖిల సంపదలను నైశ్వర్య మందురు
కననివెల్ల నీశ్వరునివె యగుట
స్వీయమనుచు వాని స్తేయమ్మొనర్చిన
కాయమనెడి బందెకాన బడెదు. 636

కాయమనెడి బందెకానలో నిడునాత్మ
'నేను' 'నాది' యనెడి నిగళయుగము
సకల వస్తువులును స్వామివేయని యెంచి
మమతc జంప ముక్తిరమ వరించు. 637

కామితములు బంధకరములై యుండుట
కామితములె దుఃఖ కారకములు
స్వార్థ కామముక్తి జన్మమోక్షంబని
నిశ్చయించి రల విపశ్చితులును. 638

నశ్వరంబు తనువు శాశ్వతంబనుచును
శాశ్వతాత్మ యెం దసత్యమనెడి
భ్రాంతి వీడుటొకటె పరమ మోక్షంబని
నిశ్చయించి రల విపశ్చితులును. 639

కర్మ జన్మ వృక్షకారణ బీజమ్ము
జన్మనష్టి ముక్తి సాధనమ్ము
జ్ఞానవహ్ని తప్త కర్మబీజమ్ములు
మొలక వెడలుటుడిగి ముక్తిబొందు. 640

దుష్టకర్మ నరకదుర్గతి బొందించు
పుణ్యకర్మ స్వర్గభూతి నొసఁగు
అడుసు జలము విడిచి వెడలు నీరజమటుల్
జ్ఞానభాను గాంచి కనుమి ముక్తి. 641

జ్ఞానరతులఁ బడయఁగల్గు నానందము
అర్థ కామరతులయందుఁ గలదె ?
సుధలు గ్రోల నాత్మ నొదవు నానందము
మదిరఁ ద్రావ నెట్టు లొదవఁ గలదు. 642

సర్వసుఖములందు సామ్రాట్టు మోక్షమ్ము
అక్షయమ్ము దాని యనుభవమ్ము
మరణ భయములేదు నిరయమ్ము దరిరాదు
వయసుపోదు క్షామవార్తలేదు. 643

మకరి నోటఁ జిక్కు మదగజం బట్టులు
మమతఁ జిక్కి నరుఁడు శ్రమలనొందు
చక్రహతి నశించు నక్రమ్ము విధమున
జ్ఞానధాటి నడఁగుఁ దాను మమత. 644

'నాది' యనెడి రూప నామాత్మకము మాయ
'నే' నటంచుఁ బల్కు జ్ఞానియాత్మ
'నాది' యనెడి బంధనము నుండి విడివడ
నదియె దుఃఖ మడఁచునాత్మ ముక్తి. 645

మమత త్రైగుణ్య విషయమై మాయఁ గూర్పు
ఉచ్చులందిడు వ్యాధుని మచ్చుగాను
మమతఁ బడిపచ్చు జీవమ్ము మంటఁ బడుచు
బ్రగ్గు శలభనిభమ్మై యై మసలుఁ గాదె. 646

అవనియందు గలుగు నైశ్వర్యమది యెల్ల
ఈశ్వరునిదె యనుచు నెరుఁగునాడె
మమతలూడుఁ బ్రబల మాయా భ్రమలువీడు
బంధమోక్ష మొదవి పడయుముక్తి 647

నాటకమున వెంట నటియించు పాత్రలు
కలఁ గాంచునట్టి ఘనవిభవము
లనుచు దారసుతుల నైశ్వర్యములనెల్ల
దలచి మమత లుడుగ వెలయు ముక్తి. 648

ఆలు మగల ప్రేమ అద్దములోపల
గానవచ్చు నీడగాఁ దలంచి
ఉభయతరువు లేట నొరసి వేరైపోవు
టరసి మమతలుడుగ నలరు ముక్తి. 649

'నాది, నాదను' భావమ్ము పాదుకొనిన
కతన మమతాను బంధమ్ము కలతవెట్టు
'కాదు కాదను' భావమ్ము గరపు చుంట
నిరత వైరాగ్యసిద్ధిచేఁ బరఁగు ముక్తి. 650

గాఢ నిద్రలందు గలలందు జాగ్రద
వస్థలందు సాక్షి పగిదిఁ గాంచు
సర్వసాక్షియైన సర్వేశ్వరాంశ మీ
యాత్మ మార్పులేని దనుట ముక్తి. 651

ఆకసమ్ము వోలె నంతట వ్యాప్తమై
యుండు నీశ్వరుం డొకండె సతము
ఘట మఠాది వస్తుకాండమ్ము లందుండు
నతడె యంచు భక్తినరయ ముక్తి. 652

ఆలుబిడ్డలందు నఖిల వస్తువులందు
సంగబుద్ధిఁ గన నెదుంగు మమత
తద్వియోగ సహజ ధర్మంబు మదినెంచ
మమత వీడు ముక్తిరమను గూడు. 653

శమము దమము నెఱపి సకలేంద్రియములపై
విజయమొంది జ్ఞాన విద్యఁ జెంది
సాధు సంగతులను జరియించి వైరాగ్య
భావసిద్ధి గనిన బడయు ముక్తి. 654

స్వార్థ రహితకర్మ, శౌరినాత్మార్పణ
భక్తి, జ్ఞాననిష్ఠ, బరఁగుచుండ
మోక్షమునకు మార్గములను నన్వేషింప
నేల మూటినొకటి చాల దొక్కొ. 655

కర్మకన్న మరియు జ్ఞానార్జనముకన్న
హరి పదాబ్జముల ననన్యభక్తి
నలరు టొకటె సులభ మాబాల గోపాల,
మందు హరిని గొలిచి పొందె ముక్తి 656

నాది నాది యనెడి నానాత్వమును రేపి
యాసఁ బెంచుఁ బాపరాశిముంచు
విశ్వసంపదలును విశ్వరూపుని వని
త్యాగియైన నాత్మ దనరు ముక్తి. 657

భోగపథముకన్న త్యాగ మార్గం బెందు
నుత్తమంబటన్న యోగులకును
నిరత మోక్షసుఖము పెరటిలోననె కల
కల్పవృక్షసమము గాదె తలప. 658

మానస రశ్మిని జేఁగొని
జ్ఞానేంద్రియ వృషభముల వశమ్మున నిడుచున్
సూనృత పథముల నడపుచుఁ
దానై తన నుద్ధరింపఁ దలకొనవలయున్. 659

స్వార్థ మెదలేక పరసేవ సల్పు కర్మ
మేను నిత్యంబు గాదను జ్ఞాన నిష్ఠ
నిరత సర్వేశ పదపద్మ శరణభక్తి
ముక్తి మార్గంబు లనిరి యీమూటి బుధులు. 660

# ప్రపత్తిమహిమ

సాధనాంతరమ్ముల వీడి సర్వశేషి
చరణ యుగళమ్మె నాకెందు శరణమనుచు
భారమెల్ల నారాయణుపైనె యుంచి
యెపుడు నిర్భరుఁడై యుంటయే ప్రపత్తి. 661

ప్రియున కనుకూలముగను వర్తించుచుండి
అననుకూలములైన కార్యముల విడిచి
కాంచి సర్వాధికుఁడగు రక్షకునె వలచి
యెపుడు దృఢ బుద్ధి నమ్ముటయే ప్రపత్తి. 662

తానెవడో ? యీశ్వరుండనగా నెవాడో ?
ఆరయ తానొందగల పూరుషార్థ మెదియొ ?
అటులె దాని బొందుట కుపాయంబదేదో ?
దానికి విరోధిఁ దెల్యుటే జ్ఞానమగును. 663

అర్థపంచక విజ్ఞాన మదియె జ్ఞాన
మగుచు వెలుగొందు నిఁక ప్రపన్నాళి కెందు
భగవ దనుభవాభిరుచియె భక్తి యగును
కర్మ కైంకర్య రూపమై గ్రాలుచుండు. 664

పతితుఁడ నకించనుఁడ నన్యగతి రహితుఁడ
అజ్ఞుఁడ నశక్తుఁడను దుఃఖహతుఁడ సుతుడ
తల్లి దండ్రులు నఖిల బాంధవులు నీవ
సకల మీవని నే నిన్ను శరణుగొంటి. 665

సములనే దరిజేర్తురు సఖులు తాము
స్వామి రిక్తకుచేలుర సఖుడవీవె
బంధువులు సంపదలలోనె బంధుజనులు
ధర విపద్బాంధవుఁడవీవె పరమపురుష. 666

ఉభయపక్ష ప్రజ్వలదగ్ని యుక్త దారు
కోటర స్థిత విచలిత కీటకమును
సఖ ! ప్రలోభన ధాన్య తృష్ణా వినిహతి
మృగయజాలా పతిత దీనఖగము నైతి. 667

క్షుత్పిపాసా నిపీడిత శోకతప్త
బంధు విరహితా శక్త స్తనంధయుండ
వరద నీదు నిర్హేతుక కరుణ దక్క
నన్ను రక్షింప హేతు వొండున్న దొక్కొ. 668

అరయ నప్పులవార లీయాలు బిడ్డ
లెవరి కెవ్వారు మృత్యుచే నీడ్వబడఁగ
స్వార్థపరు లీప్రపంచస్థ జనములెల్ల
ఎపుడు తమ మేలె తా మెదనెంచు చుంద్రు. 669

మంచివానిగా నటియించు వంచకుడను
సజ్జనుడ నేనన న్నికు చాటుగలదె
ఈ యుభయ లోకముల దొరవీవె కావె
స్వామి నీకు నర్పించ నాకేమి గలదు. 670

వేరె రక్షకు లెవ్వరులేరు నాకు
నీయహేతుక కృపయే యుపాయమింక
మత్స్య కూర్మాది సుందర మధుర వేష
భవ భయాబ్ధి దాటింప నీపదమె పడవ. 671

పతులు నైదుగురుండి ద్రౌపదిని దాము
ఆదుకొనరైరి వస్త్రాపహరణవేళ
పతులకెల్ల రకును విశ్వపతివి నీవ
యగుచుఁ గాపాడవేల యో యాత్మనాథ, 672

నీకె యుపయోగపడవలె, నీ యధీన
మగుచు నుండగవలెను నా యాత్మ స్వామి
సకలమును వీడి నీదివ్య చరణయుగళి
శరణమని నమ్మియుంటి రక్షకుఁడవంచు. 673

అన్నయగు రావణుఁడు తన్ను తన్ని పంప
అన్నిటిని వీడి శరణొందె నిన్నతండు
ఆ విభీషణు నిత్య రాజ్యాభిషిక్తు
జేసితివి ప్రపన్నుల కెందుఁ జేటుగలదె? 674

అకట సంసార కాసారమందు మకరి
పాహియను గజేంద్రునిబట్టి బాధవెట్ట
చక్రహతిఁ జెండి కరిదరిఁ జేర్చినావు
క్షితిఁ బ్రపన్నుల కెందును జేటుగలదె. 675

చేతనా చేతనములు నీదే తనువని
సకల భూతమ్ములకు నపచారపడగ
వెరచుచుండు నతండు నీవే గతియని
నిన్ను శరణనువాఁడె ప్రపన్నుఁ డెందు. 676

## విష్ణుదోషభోగ్యత్వము

హరికరస్పర్శ సుకృతి పాపాత్ముఁ డనక
ముక్తి నొనరింపగల మహాశక్తి గలది
దర్భలంగోయుఛురికయుఁ దలలఁ గోయు
నసియు స్పర్శవేధిస్పర్శఁ బసిడిగావె. 677

## హరితో భర్తృ భార్యా సంబంధము

వెన్నుసంశ్లేషముం బాసి విరహిణులగు
గోపికలు బాహ్య విస్మృతింగొని చరింత్రు
బాననిండి స్రవించినం భామయొకతె
పాలు బిదుకుచునే భూమిపాలొనర్చు. 678

రూపున మన్మథుడే యన
నా పురుషోత్తముఁడు వాని యయ్యా పవిత్ర
ప్రాపక మందాకిని యన
గోపాలుని యెడమకాలు గోటికి సరియే. 679

శ్రీపతిని గాంచ నది యే
పాపమొపక్షమ్ము లడ్డుపడు నెపుడనుచున్
దాపపడు వ్రజవిలాసిను
లేపగిదిన్ హరిని విడిచి యెసఁగుదు రవనిన్ ? 680



# కృతికర్త

## డా॥ వానమామలై వరదాచార్యులు

జననం : 16 ఆగష్టు 1912
విరోధికృతు శ్రావణ బహుళ ఏకాదశి.

జననీ జనకులు : సీతమ్మ, బక్కయ్యశాస్త్రి.

జన్మస్థలం : మడికొండ, వరంగల్ జిల్లా.

నివాసం : చెన్నూరు, ఆదిలాబాదు జిల్లా.

ఉద్యోగాలు : ఉపాధ్యాయులుగా పదవీవిరమణ, 1972 నుండి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విధానమండలి సభ్యులు.

బిరుదులు : అభినవ పోతన, అభినవ కాళిదాసు, మహాకవి శిరోమణి, ఆంధ్ర కవి వతంస, ఉత్ప్రేక్షా కవిచక్రవర్తి, కవికోకిల, కవిశిరోవతంస, డి. లిట్., విద్యావాచస్పతి ఇత్యాదులు.

ముద్రితములు : మణిమాల (పద్యగేయకృతి) ఆహ్వానం (గేయకృతి) పోతన చరిత్రం, (మహాకావ్యం) జయధ్వజం జాతీయ గీతాలు, విప్రలబ్ధ (గేయకథాకావ్యం) స్తోత్ర రత్నావళి అనువాదం· భోగినీలాస్యం (సవ్యాఖ్యానం) గీతరామాయణం (అనువాద గేయకావ్యం), వైశాలిని (మహానాటకం) సూక్తి వైజయంతి (సుభాషితములు).

అముద్రితములు : స్తవరాజపంచశతి (శతక సంపుటి). సాహిత్య వ్యాసాలు గ్రామ సుధార్, సత్యమేవజయతే, స్వతంత్రభారతం, రాజ్యశ్రీ (నాటికలు) రైతుబిడ్డ, బుద్ధచరిత్ర, ఏవడురాజు, మనదేజయం, చైనా యుద్ధం (బుర్రకథలు) తుపాకి రాముడు, కోయదొర (హాస్య నాటికలు) స్వాతంత్ర్యరథం (గేయఖండికలు) విముక్త భారత్ (హిందీగేయకృతి) శాకీర్ గీతాలు (అనువాదం) మానవులంతా మనవాళ్ళే (నవల) ఇత్యాదులు.